# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




అక్టోబరు 1958

సంపుటము 35 : : సంచిక 10

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1958



# అమృతాంజనము

ఎంత భయంకరమైన
కాలి నొప్పి నైనా క్షణంలో ఉపశమింప
జేస్తుంది

లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపజేస్తుంది.

అమృతాంజనము అన్ని నొప్పులకు దివ్యామృతము.






అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-7.

AL.86.4

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం|| లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారత భాషలన్నింటిలో వెలువడే ప్రోత్సాహక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# నిర్వేదము

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

ఎచ్చట నుంటివయ్య పరమేశ్వర! వీనిని కావ్యలోక మం
దిచ్చకువచ్చినట్లు విహరింపగ నీయక సేవకత్వమే
పుచ్చుకొనంగ నాజ్ఞ నిడబూన, రసాబ్ధులు నీపదమ్ములన్
విచ్చిన నన్నజాజియరవిందములన్ కొలువంగనెట్టులో॥

భాగ్యముతోడ నీచరణ పద్మములన్ సతతమ్ము కొల్వగా
యోగ్యతఁగల్గ నిచ్చిన మహోజ్జ్వల నూతన సత్కవిత్వ సౌ
భాగ్యమునన్ ఉదాత్త రసవార్నిధి తేలెదగాని, పట్టిదా
ర్భాగ్య జగమ్మునన్ నిలువ వచ్చునె? యేకనిమేషరక్తికై॥

ఆశయముల్ హిమాలయ శిఖాగ్రములన్ బురుడించుగాని, నన్
ఏ శని పట్టెనో మొదటి కేనియు నించుక చేరలేక, నా
యాశల నీటగల్పుకొని యంధుడనై యిట కూలియుంటినో
ఈశ! పరేశ!! నన్ను కరుణించి యొసంగుమ పూర్వసంస్కృతిన్॥

ఈ యెద నొక్కమారు పరికింపుము, నాదు దురంత వేదనన్
వ్రాయగజాల పద్యముల స్వామి! అశక్తుడ నంచు తెల్పగా
నా యభిమానమున్ వదలినాడనులే!! యిక శంకలేల, నే
నీ యనురాగ గీతకమనీయసుధారసమానెదన్ ప్రభూ॥

ఈ గుదిబండ దాల్చి యిక యెన్ని దినాలని జీవితమ్ము నే
లాగగలాడ తండ్రి? కనులం జలియించుచునుండె ప్రాణమే
లాగునసైన బ్రోవగ తలంపనిచో నిముసమ్ము యేని నే
నాగగజాలనట్టి చలితాత్ముడ నైతినయా! పరాత్పరా॥

ఆశరదిందు చంద్రికల ఆసికతాతలవేది జేరి నా
ఆశల నెల్ల నీకు తెలియంగ కవిత్వమునల్లి, అల్ల ఆ
కాశమునందు తారకల గానముతో శ్రుతిగల్పునట్టి భా
గ్యాశయ మబ్బునయ్య పరమాత్మ!! నిమేషపు జీవితమ్ములోన్॥

ఆశయహీన జీవితమె హాయిగ నున్నటు తోచు, వెఱ్ఱి యా
వేశము పెచ్చుమీఱ వినువీధిని సౌధము పైన సౌధముల్
కౌశల మొప్పగట్టితి సుఖమ్ముగ నుందమటంచు, నింతలో
రాశిగఁ జేసి యన్నిటి పరాత్పర!! రంజిలుచుందు వాత్మలోన్॥

నీవే నేనయి నేనె నీవయగుచున్ నిత్యప్రబోధమ్ముతో
భావావేశ రసైక జీవిత సముత్పన్న ప్రమోదమ్ముతో
నీ విశ్వమ్మున నుండు భాగ్య మది లేనేలేక యల్లాడు నే
నీ వాత్సల్యరసమ్ము నానుటకు తండ్రీ! ఎంతో కొట్టాడెదన్॥

జీవిత మగ్గలం బగుట జీవికయంత్రమునందు జిక్కి, నా
నా విధమైన యాతనల నల్గి కృశించితి తండ్రి! నూత్న సం
జీవిని నిచ్చి సంస్కృతి విశేష సమంచిత దివ్యమార్గ సం
భావితుఁ జేయవేడెద కృపారస వీక్షణ! సాధురక్షణా॥

నాదు జీవిత మనెడి విషాద గీతి
నీవు రచియించి నాకిడినావు గాని
శిథిల మాట ఆలాపన సేయజాల
దీ హృదయవీణ, నీవు ప్రేమించునటుల॥

ఎన్నటికినైన వికసించు నీ యెడంద
మొగ్గయని తలంచితిగాని మోసపోతి
అమిత కఠిన కర్కశహృదయమ్ముతోడ
తొడిమవఱకును దీనిని త్రుంచినావు॥

ఏమి మూటగట్టెదవు? కానిమ్ము సామి!
ఆగిపోవదు క్షణమాత్రమైన జన్మ—
ఈ విషాదాశ్రువులను జీవించువాడ
సతతమును నీదు నామసంస్మరణతోడ॥

# సుచిత్ర ప్రణయం

శ్రీ డి. బాలగంగాధరతిలక్

పాత్రలు: శేఖరం, రంగనాధం, రామనాధం, పంతులు, సోమయాజులు, సుచిత్ర.

## రంగము-1

* * ఒక పార్కులో ఒక విశాలమైన రోడ్డు. బహుశా అటువైపు మూడు నాలుగిళ్ల కన్న ఎక్కువ లేనందువలన కాబోలు ఆరోడ్డు మీద జనసంచారం చాలా తక్కువగా ఉంది. రోడ్డున ప్రక్కగా శేఖరం నిలబడి, సిగరెట్ కాలుస్తూ ఎవరికోసమో నిరీక్షిస్తోంటాడు. ఖరీదైన పాంటూ షర్టూ టక్‌అప్‌లో ఉంటాడు. శేఖరం స్ఫుర్ద్రూపి. అతనిలో ఆడంబరమూ, చొరవా తెగింపూ వ్యక్తమౌతూంటాయి. ఎంత అణచినా అణగని ఉత్సాహమూ, ఎన్ని కష్టాలు వచ్చినా నశించని ఆశావాదమూ (Optimism) అతని తీరుకీ ప్రవర్తనకీ ఒక ఆకర్షణని కలిగిస్తాయి. అతను అలాగ ఎవరికోసమో చూస్తూ నిల్చుంటే, వెనుకనుంచి అతని మిత్రుడు రంగనాథం వస్తాడు. పాంటూ బ్లౌజూ ధరిస్తాడు. శేఖరం కన్న ఒకటి రెండు సంవత్సరాలు పెద్ద.

కాలం: ఉదయం ఎనిమిదీ తొమ్మిది గంటలకి మధ్య:

రంగ: (వీపుమీద చరుస్తూ) హలో శేఖర్. ఇక్కడ నిలబడ్డావేం రోడ్డుమీద.

శేఖరం : (ఉలిక్కిపడి) హారి నువ్వట్రా రాస్కెల్. ఇంకా యింటాయన చేమో అనుకున్నాను. అద్దె కోసం దంపేస్తున్నాడు రాత్రీపగలూ. అందువల్ల మూడురోజులనుంచీ రూమ్‌కి గైరు హాజరు కొట్టేస్తున్నాను.

రంగ: అలాగా! అయితే ప్రస్తుత మకాం ఎక్కడ.

శేఖరం : పగలంతా జాతీయ ప్రభుత్వంవారి రోడ్డు, పార్కులు. రాత్రుళ్ళు క్లబ్బులు నీలాంటి మిత్రుల లాడ్జీలు. 'విపులాచ పృథ్వీ' అన్నాడు భవభూతి అనే ఫ్రెంచికవి శేఖరుడు.

రంగ: (ఎగా దిగా చూసి) మాంచి టిప్ టాప్ గా ఉన్నావు ఏదైనా ఉద్యోగం దొరికిందేమిట్రా!

శేఖరం : ఎవడిస్తాడురా మనకి ఉద్యోగం. తలవొంచి శ్రమపడి పనిచేసే లాపతింటావా నేను. ఇంత శ్రమపడితే నెలకి ఓ ముష్టి వందరూపాయల జీతం!

రంగ: ముష్టి వందరూపాయలా ధనిః సార్వభౌమా!

శేఖరం: అందులోనూ యౌవనంతో, ఆనందంతో, ఆశలతో మిసమిసలాడే ఈ జీవితాన్ని కుమాస్తాగిరీకి బలియివ్వడం మహాపాపంరా రంగడూ! ఒకేయ్! మన లెక్క ప్రకారం ఏభైఏళ్ళు వచ్చేవరకూ మానవుడు కష్టపడకూడదురా! ఆ పైన మన దేశాచారం ప్రకారం వృద్ధుడైపోతాడు కాబట్టి ఎలాగూ కష్టపడలేడు. కాబట్టి జీవితాన్ని నిరంతరసుఖప్రదం చేసుకోవాలనే థియరీ మనం కనిపెట్టింది!

రంగ: హారి నిన్ను తగలెయ్య! పూటకి టికానా లేదు. బి. ఎ. ప్యాసై బిచ్చులన్నట్టు గాడిదలా తిరుగుతున్నావు మరి నీకే తిండీ బట్టా ఎవరు సప్లయి చేస్తున్నారురా మరి.

శేఖరం : (సిగరెట్టు దమ్ము గట్టిగా లాగి) ఒకేయ్ రంగడూ నా జీవితసూత్రం నీకు విశదపర్చి చెప్తా

లంటే ఒకరోజు, అది నీకు అర్థంకావాలంటే ఒక సంవత్సరం, దాన్ని నువ్వు ఆచరణలో పెట్టాలంటే ఒక శతాబ్దం పడుతుందిరా మై డియర్! కాబట్టి మూడుముక్కల్లో చెబుతాను విను. జీవించడమనేది ఒక కళ. ఆ కళని ఆధారం చేసుకుని మూడు ఉపకళలున్నాయి. ఒకటి అప్పు చెయ్యడం, రెండు అబద్ధాలాడడం, మూడు వేషభాషలు. ప్రస్తుత నా నిరుద్యోగ నిర్వాస నిరాహారదీక్షలో ఈ మూడింటిలోనూ గొప్ప ఎక్స్‌పర్ట్ నైపోయాననుకో.

రంగ: నిజం!

శేఖరం: నిజం. (విషాదంగా) ఏం చెయ్యమంరా బ్రదర్. చెడ్డవాణ్ణి అనుకోకు. మనలాంటి మధ్య తరగతి యువకులకి యింతకన్న ఆస్కారం ఏముంది. గౌరవంగా స్వేచ్ఛగా జీవించేందుకు మార్గాలు లేవు. అలాగ అని స్వతంత్రాన్నీ హృదయాన్నీ చంపుకొని, ఆశయాల్నీ ఆకల్నీ కట్టిపెట్టి సైకు కాలవలో పారేసి జీతం డబ్బులకోసం బ్రతకడమనేది—మై గాడ్—నే నూహించలేనురా.

రంగ: అవునుగాని నీకు అప్పు ఎవడిస్తాడంట? నూట యాభైరూపాయల నికరమైన మాసిక సంపాదన వున్న వాళ్ళకే పుట్టదు.

శేఖరం: అందుకే అప్పు చెయ్యడం కూడా ఒక కళ అన్నానురా మిసర్. మాటవరసకి మన ఫ్రెండు గజపతిని ఎరుగుదువా?

రంగ: తెలియకేం—ఆర్ అండ్ ఆర్ ఫరమ్‌లో పని చేస్తున్నాడుగా.

శేఖరం: వాడికి నువ్వంటే ఎంత గురీ, ఎంత గౌరవమూ, ఎంత విశ్వాసమూ ప్రయోజకుడివనీ తెలివైనవాడివనీ...

రంగ: అవునవును. పాపం వాడికి నేనంటే అమిత అభిమానం.

శేఖరం: అవునా! మొన్న నేనేం చేశానో తెల్సునా. అర్జంటు అవసరం వచ్చింది. ఒక్క పాతికవుంటే యివ్వరా బ్రదర్, మన రంగడు నాకివ్వవల్సిన పాతికా నీకు విలియా వేస్తాను, పాపం వాణ్ణి ఈ సెలాఖరు రోజుల్లో ప్రెస్ చెయ్యడం నాకిష్టం లేదురా అని ఓ పాతిక రూపాయలు సంపాదించాను.

రంగ: (తెల్లబోయి) నేను నీకివ్వాలనా? నీ మొహానికి నాకు అప్పుపెట్టే స్తోమతుకూడా వుందా! ఏం గుండెల్రా నీవి. ఎంత అబద్ధం, పచ్చి వట్టి అబద్ధం.

శేఖరం: అబద్ధం నల్లగా ఉండదురా భాయ్. జర్మన్ సిల్వర్ లా తళతళమని మెరుస్తూ నిన్ను లోబరుచుకుంటుంది. సత్యం నిజంగా నల్లగా ఎక్కడో మూలపడి ఉంటుంది.

రంగ: ఇంత ఘోరంగా ప్రవర్తిస్తావనుకో లేదురా.

శేఖ: కంగారు పడకురా రంగడూ. ఆపదలందు ధైర్యమున్నాడు భర్తృహరి అనే అమెరికన్ పొయెట్.

రంగ: నేను వెళ్ళి గజపతికి నువ్వు చేసిన మోసం చెప్పేస్తాను.

శేఖ: చెప్పరూ! చెప్పినంత మాత్రాన తల తీసేస్తాడా ఏమిటి—ఇంతకీ స్నేహితులం కదా! పోనుకాని బ్రదర్ ఒక్క అయిదు రూపాయలుంటే... (చెయ్యి చాపుతాడు.)

రంగ: (కంగారుగా) ఒకేయ్. నాకే మస్కా కొట్టుతున్నావేమిటి.

శేఖ: సారీ (నవ్వేస్తాడు.) అలవాటు పొరపాటున అడిగేను. 'తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు, కుందేటికొమ్ము సాధింపవచ్చు కానీ చంపినా చచ్చినా రంగనాథునినుండి కానీ రాలదెపుడు' అన్న లోకోక్తి ఊరికే పోతుందా.

రంగ: థాంక్స్. డబ్బుదగ్గర మనకి చాలా గట్టి అనుభవముంది మిత్రమా!

శేఖ: (ఇటూ అటూ చూసి) ఒకేయ్ రంగడూ, ఇంక నువ్వెళ్ళిపో.

రంగ: ఏం యిక్కడ నిలబడకూడదా.

శేఖ: ప్లీజ్ ఆ అమ్మాయి వచ్చే వేళయిందిరా.

రంగ: అమ్మాయా! ఎవరా అమ్మాయి? ఎవరి అమ్మాయి. తదితర సుగుణాలేమిటి. సవిస్తరంగా చెప్పు.

శేఖ: సుచిత్ర.

రంగ: సుచిత్ర! లక్షాధికారి రామనాథంగారి అమ్మాయి!

శేఖ: ఎగ్జాక్ట్లీ.

రంగ: అయితే?

శేఖ: ఇంకా నీవు తెలియదురా రంగడూ. నువ్వే లోకంలో ఉంటున్నావో నాకు అర్థం కావటం లేదు. ద్వితీయుడు శేఖరంయొక్క జీవిత చరిత్రలోని యీ గొప్ప అధ్యాయాన్ని విస్మరించావని తెలిస్తే—భావి చరిత్రకారులు నిన్ను మెచ్చరురా.

రంగ: అసలు సంగతి ఏమిటో ఏడుద్దూ.

శేఖ: ఆ అమ్మాయిని నేను ప్రేమిస్తున్నాను. కాలేజీ వదలిన మరుక్షణంనుండీ యిదే మన జీవితాశయం. నువ్వొక్కడివితప్ప యీ విషయం తెలియనివాడు మన దేశంలో నే లేడు.

రంగ: అదేదో ప్రేమించటం అనే పని చేస్తున్నావని తెలుసునుగాని నీ ప్రేమకి లక్ష్యమైన దురదృష్ట వంతురా లెవరో తెలియదు. అయినా, నువ్వం దర్నీ ప్రేమించెయ్యొచ్చును. ఖర్చు లేని వ్యవహారం.

శేఖ: ఇదా నువ్వు చెప్పేది. అసల నీవు ప్రేమంటే ఏమిటో తెలుసునా! ఆ ప్రేమించే తాహతూ, హృదయమూ నీకు ఉన్నాయా? నువ్వు కీట్సునీ కృష్ణశాస్త్రినీ చదివావా? రాత్రిళ్ళు మల్లె పూలు వాసనచూస్తూ ఏడుస్తూ పక్కమీద దొర్లావా! పోనీ ఎప్పుడేనా చంద్రోపాలంభన అయినా చేశావా! కరకుగట్టిన గుండెగల నువ్వు నా ప్రేమని విరసించటం అంధుడు సూర్య కాంతిని ఆక్షేపించినట్టు ఉంటుంది.

రంగ: నా మాటకేంకాని, ఏదేనా ఫలితం కనపడు తోందా!

శేఖ: ఆ అమ్మాయి చాలా చెట్టుగా వుంటోంది. ఎన్నో లవ్ లెటర్సు వ్రాశాను. మా నాన్నకి చెబుతాను, మా ప్రిన్సిపాల్‌కి చూపిస్తాను అని బెదరిస్తుంది. కాని ఏ ఒక్కటి చెయ్యలేదు. దానికి మనం అంటే యిష్టమున్నట్టు అదే దాఖలా అనుకో.

రంగ: అనవసరంగా తానుకూడా రచ్చకెక్కవలసి వస్తుందనే భయంవలన ఆమె గప్‌చిప్‌గా ఊరు కుని వుంటుంది. కాక, అది నీ మీద ప్రేమగా భావిస్తే నీ కామన్‌సెన్సునిగురించి సందే హించవలసి వస్తుంది.

శేఖ: స్త్రీ హృదయం నాకు బాగా తెలుసునురా మిసర్! ఆమె పైకి చూపే విముఖత, కోపం వెనుక ఎంత ప్రేమవుందో, ఆమె ప్రవర్తనా, స్వభావమూ చెప్తూనే ఉన్నాయి. ఒకేయ్ బ్రదర్! ఒక్కొక్క ఆడది ఒక్కొక్క రకం వీణ అనుకో. ఎవర్ని ఎలా మీటి పలికించాలో అదొక బ్రహ్మాండమైన కళ. ఆడది మంచి గంధం చెక్కలాంటిది. గంధం చెక్కని రాయగా రాయగా గంధాన్నిస్తుంది. అలాగే ఆడదాని చుట్టూ తిరగ్గా తిరగ్గా ఓ ఫైన్ మార్నింగున 'ఏమండోయ్. మిమ్మల్ని నేనూ ప్రేమించేస్తున్నాను' అని చటుక్కున అనే స్తుంది.

రంగ: నువ్వు శక్తిస్వప్నికజీవివిరా శేఖరం. కథలు వ్రాయడానికీ, నాటకాల్లో వేషాలు వెయ్యడా నికీ పనికొస్తావుగాని లోకాన్ని అంచనా వెయ్య లేకపోతున్నావురా. ఒకవేళ ఆ అమ్మాయి అంత బుద్ధిలేనిదై నీలాంటి లోఫర్ని ప్రేమిం చిందే అనుకో, వాళ్ళనాన్న నిన్ను ఓ పెయిర్ ఆఫ్ టాంగ్సు (Pair of tongs) తో ఓ పుచ్చు కుని ఏరిపట్టగా ఏరి గోడ అవతలికి విసిరె య్యడూ!

శేఖరం: ఒకేయ్ నువ్వు గుమాస్తావి. గుమాస్తా ఎవడికీ జీవితంలో రొమాన్సు నిజమౌతుందనీ, అన్నీ కాకపోయినా కొన్ని అయినా సుఖాంతం అవుతాయనీ నమ్మకం పోతుందిరా. పట్టి సినికల్ గా అయిపోతాడు. చూడు.. ఈ అమ్మాయి రామనాధంగారి ఏకైక పుత్రిక. అందులో గారా బపట్టి, అర్ధరాత్రివేళ ఆమె లేచి ఇప్పుడు నాకు సూర్యకాంతి కావాలి అంటే ఈయన తక్షణం గగనమార్గంలోకిపోయి సూర్యభగవానుణ్ణి జబ్బ పట్టుకు తీసుకు వచ్చేస్తాడంటే నమ్మ. అటువంటప్పుడు ఈమెని కాదనగలడా... అరెరె! ఆ అమ్మాయి యిటే వస్తోంది. ప్లీజ్ గెటవుట్.

రంగ: ఏదీ ఆవిడ్ని ఒక్కసారి చూడనియ్యి.

శేఖరం: ప్లీజ్. పోరా. పోవో. (భుజం పుచ్చుకుని లాక్కుపోతూ) అబ్బబ్బ! యీ రోడ్డుమీదైనా

కొంచెం ఏకాంతం దొరకక పోతే ఎలాగరా.

(రంగనాథం వెళ్లిపోతాడు. సుచిత్ర ప్రవేశం. పంధొమ్మిది సంవత్సరాల వయస్సు అందం ఆకర్షణ, సంస్కారం, తెలివి అన్నీ అమరి ఉంటాయి. ఖరీదైన చీర ధరిస్తుంది రెండు జడ లల్లుకుంటుంది. చేతిలో వానిటీ బేగ్ ఉంటుంది)

శేఖరం : గుడ్ మార్నింగ్ సుచిత్రా దేవి.

సుచిత్ర : (ముసిముసి నవ్వి)... మార్నింగ్.

శేఖరం : ఇలాగ షాపింగ్ కి బయల్దేరారా ఏమిటి.

సుచిత్ర : అది మీ కనవసరం

శేఖరం : నిజమే. కాని అనవసరమైనవాటిలో జోక్యం కలిగించుకోవడం నాకొక సరదా లెండి

సుచిత్ర : (మాట్లాడక ముందుకు నడుస్తుంది.)

శేఖరం : సుచిత్రా దేవి అన్నట్టు నా మాట. పదహారవ ప్రేమలేఖ మీకు అందించనున్నాను.

సుచిత్ర : అగ్నిహోత్రుడికి అందింది.

శేఖరం : (బాధతో) అంతమాట అనకండీ. గుండెల్ని కాల్చేసినట్టయిపోతుంది.

సుచిత్ర : మీమీద ఏమీ యాక్షన్ తీసుకోనందుకు సంతోషించండి. మీకు వార్నింగ్ యిస్తున్నాను. మీకూ నాకూ ఏమీ సంబంధం లేదు. యిక ఉండబోదు. ఇకముందు మీ ప్రవర్తన మారక పోతే నేను తీసుకోదగిన చర్య తీసుకుంటాను.

శేఖరం : మీకు కోపంగాని సుచిత్రా, ఒకేఒక చర్య తీసుకుంటే యీ శేఖరం జీవితం ధన్యమై పోతుంది.

సుచిత్ర : మీకు అలవాటే నన్న మాట.

శేఖరం : ఏమిటి.

సుచిత్ర : తాగుడు.

శేఖరం : (నవ్వి) మీకు చాలా కోపం ఉందండీ. కోపంలో మీరు మరీ అందంగా ఉంటారు.

సుచిత్ర : షటప్.

శేఖరం : నోరు మూస్తానే అనుకోండి, ఈ కళ్లు యీ మనస్సు యీ ప్రాణం—వీటి నెలాగండీ మూయడం. అవి మీ వెనకాలే పరుగెత్తుతాయి కదా.

సుచిత్ర : (విసుగ్గా నవ్వి) ఈ గోడ్లుకాయడంతప్ప మీకు మరేమీ పనిలేదా ఏమిటి.

శేఖరం : నిజం చెప్పారు సుచిత్రాదేవి. ఈ మధ్య ఫాక్టరీల్లో ఒకటి రెండు ఉద్యోగాలు వచ్చినా తిరగగొట్టేశాను. బి. యే ప్యాసై రెండేళ్లయినా యీ ఊరొదిలి వెళ్లలేక పోయాను. మిమ్మల్ని ఎక్కడ చూడలేకపోతానో అని మీరు నడిచే యీ రోడ్డు, కూర్చునే పార్కులో బల్లా, కాలేజీ గేటు—యివన్నీ పుణ్యస్థలాలంటే నమ్మండి. మీరు నాకు దేవి, దేవత...

సుచిత్ర : ఇంక కట్టిపెట్టండి.

శేఖరం : మీరు ఏమన్నా అనండి పడతాను. ప్రేమకి యింత శక్తి, యింత వేడి ఉందని నాకు యిది వరకు తెలియదుసుమండీ. ఒకసారి వరుసగా రెండు రోజులు మీరు కనపడకపోతే మీరు కనిపించేటంతవరకూ ఏమీ తినకూడదనిపించి-మంచి నీళ్ళు మినహా ఏమీ ఆహారం లేకుండా అలా ఉండిపోయానంటే నమ్మండి. సరే, మూడవ రోజున మీరు కనిపించారు.

సుచిత్ర : (హేళనగా) పాపం అప్పుడైనా భోంచేశారా.

శేఖరం : మీరు కనిపించాక యింక భోజనమెందుకూ కడుపు నిండిపోయింది.

సుచిత్ర : మిస్టర్ శేఖరం గారూ. ఇలాగ ఉపవాసాలు చేయడానికీ యింకా గొప్ప తపశ్శక్తులు చూపించడానికీ మీలో ఏదో మాహాత్మ్యం ఉండి ఉండాలి. ఇంకా మన దేశం మిమ్మల్ని గుర్తించక పోవడం చాలా విచారకరం. కాని మీరు నన్ను యిలాగ వెంబడించడమూ, యీ అర్థంలేని వాగుడూ, మీకూ నాకూ కూడా గౌరవప్రదము కాదనీ ఉచితం కాదనీ మీకు తెలియజెయ్యడం చాలా అవసరం. ఇదిగో మీకు మళ్ళీ చెప్తున్నాను. మీ శ్రమకి ఫలితం లేదు. మీ దారిన మీరు దయచెయ్యండి.

శేఖరం : (హతాశుడై) అంతేనంటారా.

సుచిత్ర : అంతే. ప్లీజ్. ఇక దయచెయ్యండి (విసురుగా వెళ్ళిపోతుంది.)

శేఖరం : హారి శేఖరం! నీ యీ శ్రమ అంతా వ్యర్థంరా! మళ్ళీ నిరుపేదవి, నిరుద్యోగివి.

నువ్వు లో ఫలుచి. డామ్ స్కౌండ్రల్ వి. అంతే కాని నీ హృదయం నీ ఆశయం ఎవరికి కావాలి. చదువుకున్న ఆడపిల్లలకి కూడా ధనం హోదా గౌరవం అంటే ఉన్న మోజు మనుష్యులంటే లేదు. ఈ సంఘానికి మనిషీ, మనిషికుండె కొదు కావలిసింది. ఈ సంఘం రాక్షసుల సంఘం— ఇక్కడ నాలాంటివాడికి స్థానం లేదురా, లేదు —అరె! సుచిత్ర వెళ్ళిపోయిందే! ఇప్పుడేమిటి కర్తవ్యం. (తీవ్రంగా ఆలోచిస్తాడు. ఒక నిశ్చయానికి వస్తాడు.) ఈ శేఖరానికి ఓటమి అనేది లేదు. ఇదేదో చివరికంటా చూసి తీరుతాను. శేఖరం అంటే ఏమిటి? Hope forever hope. (హోప్, ఫరెవర్ హోప్.)

(గాలిలో చెయ్యి ఊపుతూ సుచిత్ర వెళ్ళిన దారినే వెళ్ళిపోతూంటే గుమాస్తా సోమయాజుల్ని ఢీకొంటాడు. సోమయాజులికి వలసై పైబడిన వయస్సు. బట్టతలా, పాత కళ్ళజోడు, యితర బానిస చిహ్నాలు.)

శేఖరం : (ఆగి.) అయ్యా! ఒక్కమాట. ఈ దారిన ఒక అమ్మాయి, ఒక అందమైన అమ్మాయి, రెండుజడల అమ్మాయి కనపడిందేమో చెప్ప గలరా.

సోమ : ఎవరు నువ్వు. (కళ్ళజోడు సవరించుకుంటూ చూస్తాడు.)

శేఖ : (ఉలిక్కిపడి) మన్నించాలయ్యా మహానుభావా! సెలవ్. వస్తాను.

సోమ : (చెయ్యి పట్టుకుని) ఏమయ్యా శేఖరం. యిప్పటికి దొరికావ్. నా అద్దెమాట ఏం చెప్పావు? రెండురోజుల్నుంచి నీ కోసం వీధులన్నీ గాలిస్తున్నాను.

శేఖ : నే చెప్పేదాన్నా యిచ్చేదాన్నా స్వామీ. ఎటొచ్చీ ఒక్క సంవత్సరం కదా అయింది! ఇంక కొన్నాళ్ళు ఓపిక పట్టండి.

సోమ : ఇంక వీల్లేదు. నీ తియ్యని మాటలకీ మోసాలకీ యింక లొంగను. ఇన్నాళ్లు నా యింట్లో బైఠాయించి ఒక్క నెల అద్దె యిచ్చిన పాపాన పోయావా! న్యాయం ఉందా! వాయిదా వేస్తే ఒప్పుకోను. యిచ్చి తీరాల్సిందే.

శేఖ : మీరు చెప్పింది నిజమే కాని మా గ్రామంనుంచి రావాల్సిన సొమ్ము యింకా రాలేదు. తర్వాత, చూడండి. జీతాల్లాగ యింటి అద్దె ఎప్పుడూ ముందే నియమాలు చేసుకోవాలి లేకపోతే వాయిదాలు తప్పవు. ప్రపంచంలో కొన్నిటికి వాయిదా గుణం ఉంటుంది. చెలగులు ఒకటి, యింటద్దె ఒకటీ కోర్టు దావా ఒకటి...

సోమ : ఈ కబుర్లన్నీ పనికిరావు నాకు చాలా అవసరంగా ఉంది. నీ బాబు అక్కి సగం అయినా చెల్లించి...

శేఖ : ఇప్పుడేమీ లాభం లేదు సోమయ్యగారూ. ఇప్పుడు ప్రతి నిముషం అమూల్యమైనది. సుచిత్ర యీపాటికి చాలాదూరం వెళ్ళిపోయి ఉంటుంది. దంపేరాడ కార్య పావకంలో పుడక లాగ అన్ను రచ్చి (వేగంగా వెళ్ళిపోతాడు.)

సోమ : సుచిత్ర! సుచిత్ర ఎవరు చెప్మా. మా జమీందారుగారి అమ్మాయి కాదుకదా. ఏమయ్యోయ్ శేఖరం. (వెనకాలే పడతాడు.)

(రెండు నిముషాలపాటు స్టేజి ఖాళీగా ఉంటుంది. మరోక వైపునుంచి సుచిత్రా వస్తుంది. వెనకాలే శేఖరం వస్తాడు.)

శేఖ : (ధీనం ధీనంగా) మిస్ సుచిత్రా దేవి!

సుచి : (ఆశ్చర్యంగా) మీ రింకా...

శేఖ : అనుసరిస్తూనే ఉన్నాను. ఛాయ ఎప్పుడూ వెంబడించేదేగా.

సుచి : (కోపంగా ముందుకు వెళ్ళుతుంది.)

శేఖ : మీ చీర చాలా బాగుందండీ.

సుచి : మీరుకూడా ఒకటి కొనుక్కుంటారా.

శేఖ : (చిరాయి కూడా) ఈ ఎండలో మీ వొళ్లు పసిమి బంగారంలాగ మెరిసిపోతోందండీ.

సుచి : మీకు మతిపోయిందండీ.

శేఖ : ఎగ్జాట్లీ. కరెక్టుగా డయాగ్నైజ్ చేశారు.

సుచి : థాంక్స్.

శేఖ : చూడండి. ప్రేమ గుడ్డిది అన్నారు. కాని అది నిజమైతే మీరు నా కళ్లకి రోజురోజూ మరీ ప్రకాశవంతంగా ఎలాగ కనపడతారు చెప్పండి. అసలు మీరు లేనిచోటకూడా మీరు కనపడతారు

కదా ఈ కళ్లకి. ఈ ప్రకృతి అంతా వసంత శోభల్ని వెలారుస్తున్నట్టు ఉంటుంది. పచ్చి శీతా కాలంలోకూడా. ఇంక ప్రేమ గుడ్డిదలా అవుతుంది. ఆ చెప్పిన కవి యెవడో కాని...

సుచిత్ర : పచ్చకామెర్ల వాడికి లోకం అంతా పచ్చగా కనపడుతుందిట.

శేఖరం : మీ రలాగ తీసేస్తే నే నొప్పుకోను. ప్రేమ సృష్టికి మూలం. ఆదిదంపతులు శివపార్వతుల దగ్గర్నుండి లైలా మజ్నూ రోమియోజూలియట్..

సుచిత్ర : (చెవుల్లో వేళ్లు పెట్టుకొని) మీ వాగ్ధోరణి విపరీతంగా ఉంది—

(చటుక్కున వెనక్కి తిరిగి వచ్చినదారినే కోపంగా వెళ్ళుతూంటుంది.)

శేఖరం : అరె! ఇంటివైపు వెళ్లిపోతున్నారే.

సుచిత్ర : మీలాంటి పెద్దమనుష్యులు దారులు కాస్తుంటే ఏమిటి చేసేది—ఛీ, సభ్యత తెలియని ఊరు. నే నింటికి పోతాను.

శేఖరం : (రెం డడుగులు వేసి) మళ్ళీ ఇంతదూరం నడిచివెళ్తారా! పోనీ రిక్షా పిలవమన్నారా.

సుచిత్ర : (దురదురా చూస్తుంది.)

శేఖరం : కాకుండగా మీ కీ శ్రమ ఏమిటి ఖర్మం. మీ రిలా నడుస్తూంటే నాకు కాళ్లు నొప్పులు పెడుతున్నాయి. మీరు దవడ వాయిస్తారని భయంకాని మిమ్మల్ని భుజాలమీద యెత్తుకు మోసుకుపోవాలని వుంది.

సుచిత్ర : (పక్కున నవ్వి) మీకు నేనంటే భయం ఉందన్నమాట.

శేఖరం : తగనిభయం సుచిత్రాదేవి. ఈ ప్రపంచంలో దేనికీ భయపడను—భయపడలేదు. రాత్రులు ఒక్కణ్ణీ ఊరికి దూరంగా ఏకాంతంగా కూర్చుని గడిపిన రోజులకి భయపడలేదు. దరిద్రానికీ చావుకీ భయపడలేదు. కాని మీరంటే...

సుచిత్ర : (ఆశ్చర్యంగా) మీకు వెనకాల ఏమీ లేదా.

శేఖరం : లేకేం సుచిత్రా—ఉన్నాయి వూళ్ళో అప్పులు.

సుచిత్ర : అంత పేదరికంలో ఉండి కానీ సంపాదన లేని పరిస్థితిలో మీకు పెళ్ళి ఎందుకండీ?

శేఖరం : ఎంత మాటన్నావు సుచిత్రా! ప్రేమే పెన్నిధి. ప్రేమించుకొన్న స్వప్నజీవులకు ఈ సిరిసంపదలూ ఈ భోగభాగ్యాలూ తుచ్ఛాలు కావులండీ. మీకు నేనూ, నాకు మీరూ ఉండగా మరింకేం కావాలి. ఒకరి నడుంచుట్టూ ఒకరు చెయ్యివేసి ఒకరి కళ్లలోకి ఒకరు చూస్తూ ఎన్ని యుగాలైనా గడిపివెయ్యవచ్చును కదండీ.

సుచిత్ర : ఔనులెండి. మీరు మీ మిత్రులదగ్గర ఒకటి రెండూ అప్పు చేస్తూంటే, నేను పొరుగమ్మ యిరుగమ్మలదగ్గర కొంచెం బియ్యం, ఉప్పూ, పప్పూ బదులు చేస్తూంటే—

శేఖరం : మీ కేం సుచిత్రా. నువ్వు శ్రీమంతురాలివి.

సుచిత్ర : అయితే నా ధనం ఆశించి నన్ను చేపట్టాలని చూస్తున్నా రన్నమాట.

శేఖరం : కాదు కాదు సుచిత్రా! ఇక్కడ మిమ్మల్ని, అక్కడ ఆగాఖాన్ ధనాన్ని, రాక్ ఫెలర్ ఖజానాల్ని, ఫోర్డు మిలియన్సునీ, నైజాం ధనాగారంలో దాచిన బంగారుకడ్డీలనీ పెట్టి నీకేం కావాలని అంటే, సుచిత్రా అమిరుమిల్లు గోల్డ్ ధనాన్ని యిలాగ కాలితో తన్నేస్తాను. నేను ధనానికి దాసుణ్ణయితే, యిన్నాళ్లు యీవూళ్లో అవస్థపాలూ పడుతూ యిలా ఉంటానా.

సుచిత్ర: (మార్దవంగా) మీలో ఎంత త్యాగశీలమూ సహనమూ ఉన్నాయండీ.

శేఖర: (బ్లిజయి) నాపరిచయం అయిన కొద్దీ మీకు క్రమంగా నాలోవున్న యితర సుగుణ సంపద కూడా తెలియవస్తుంది.

సుచిత్ర: కాని చూడండి మిస్టర్. నా జీవితవిధానం వేరు. నాకు నిరంతరం, సౌఖ్యం, భోగం అలవాటు. ఏం కోరినా అది కాళ్లముందు పడాలి. మీకున్న ఉత్తమగుణాలు నాలో లేవని విచారిస్తున్నాను. చీరలు, నగలూ, కార్లూ, నౌకర్లూ—ఇవన్నీ నా కనీసపు అవసరాలు. కనీసం వెయ్యిరూపాయలు సంపాదించగలిగినవాడైతే, నా వివాహానికి ఆశింపవచ్చును. మీకా అర్హతలు లేవని తెలుస్తూనే ఉంది. మీరు సోమరులు. స్వప్నాల్ని భోంచేస్తూ మత్తుగా నిద్రపోయే ఓ రకం గొంగళీపురుగులు. ఇంక మీరు ప్రయత్నం విరమించడం వివేకమైన పని. నమస్తే. ఇక నన్ను విసిగించకండి.

(సుచిత్ర వెళ్లిపోతుంది. శేఖరం స్తంభీభూతుడై కూలబడినాడు. కొంతసేపటికి తేరుకొని యిటూ అటూ ఆలోచనాసంద్రమున మునక్కడై తిరుగుతాడు.)

శేఖరం: నిజం ఎందుకు చెప్పావురా శేఖరం. కోటా కడిగేసి గ్లామర్‌ని కుడిచేసి ఎందుకు నీ వున్న పరిస్థితుల్ని ఆమెకి చెప్పావు. నా చితిని నేనే పేర్చుకున్నాను. నా ఆశలకి నేనే ఉరిత్రాడు బిగించాను. ఎంతపని జరిగింది. ఎంత సుళువుగా చెప్పగా తన నిరసననీ యీసడింపునీ వ్యక్తం చేసింది. ఇప్పుడేం చెయ్యను—

[శేఖరం నిష్క్రమిస్తాడు. మరోకవైపునుంచి తిరిగి సుచిత్రా, వెనకాల శేఖరమూ ప్రవేశిస్తారు.]

శేఖరం: సుచిత్రా దేవీ! సుచిత్రా దేవీ!

సుచిత్ర : (వెనక్కి తిరిగిచూస్తుంది.)

శేఖరం : ఇక్కడ యీ రోడ్డుమీద, యీ ధూళిలో పారవేసుకొని వెళ్లి పోతున్నారా?

సుచిత్ర : (ఒళ్లంతా చూసుకొని, చేతిసంచీ తెరచి చూసుకొని) అబ్బే, నేనేమీ పారవేసుకోలేదే!

శేఖరం : పారవేశారు దేవీ, యీదీనుడి గుండెకాయని నిర్దయంగా కఠినమైన మీ పాదాలతో తొక్కి వెళిపోతున్నారు.

సుచిత్ర: ఇంక కవిత్వం కట్టిపెట్టండి. మాయిల్లు దగ్గరకు వచ్చేసింది. ప్లీజ్ గెటవే—

శేఖరం: (ఒకటి రెండడుగులు వేసి) అయితే సుచిత్రా దేవి ఒక్క సలహా చెప్పండి. మిమ్మల్ని ఇంక బాధించను.

సుచిత్ర : అయితే ఏమిటో చెప్పండి.

శేఖరం : జలం మంచిదా, ఎలక్ట్రిక్ తీగ మంచిదా, విషం మంచిదా?

సుచిత్ర : ఎందుకూ.

శేఖరం : సునాయాసంగా మరణించడానికి. శేఖరం అనే అబ్బాయి సుచిత్ర అనే అందమైన దయలేని అమ్మాయిచేత తిరస్కరింపబడి ఆత్మహత్య చేసుకోదలచాడు.

సుచిత్ర : (నవ్వుకొని, ఆలోచనగా) మీరు సైనేడ్ పేరెరుగుదురా?

శేఖరం : (షాక్ అయి) ఏమిటీ!

సుచిత్ర : పొటాషియం సైనేడ్ అనే ఒక విషం ఉందిలెండి. అది విషాల్లోకలా రాజులాంటిది. ఒక్క చుక్క నాలికమీద వేసుకుంటే వేసుకున్నట్టుగా గప్‌చిప్‌గా పోతారటండీ. మనవూళ్ళో మెడికల్ స్టోర్సులో దొరుకుతుంది. మరచిపోతారేమో పేరు నోట్ చేసుకోండి. పొటాషియమ్ సైనేడ్.

శేఖరం : (గుండెల్ని పట్టుకుని) ఎంతమాట అన్నావు సుచిత్రా.

సుచిత్ర : ఇదే మాయిల్లు—గుడ్ బై.

శేఖరం : (గబుక్కున ఆమె చెయ్యిపట్టుకుని) సుచిత్రా దేవీ

సుచిత్ర: (విదిలించుకుని) గెటవుట్.

శేఖరం : చచ్చినా మిమ్మల్ని వదలను.

(సుచిత్రని అనుసరిస్తాడు. తెర.)

## రంగము-2

* * రామనాధంగారి యింట్లో ముందరి హాలు. ధనవంతుల యిళ్ళల్లో ఉండే అలంకరణ అంతా ఉంటుంది. ఒక పెద్ద డ్రాయరుముందు కూర్చుని రామనాధంగారు ఏవో ఫైల్సు చూస్తుంటాడు. సంగీతం మేస్టరు 'పంతులు' పక్కగా నిలబడి ఉంటాడు. రామనాధంగారు ఫైల్సుమూసి ముందుకు వస్తాడు.

రాము: పాపింటికి వెళ్లిన అమ్మాయీ రాలేదు. అద్దెలు వసూలుచేసి యివ్వవల్సిన గుమాస్తా కూడా రాలేదు. మేష్టారూ! ఈ కాలంలో సకాలంలో ఏమీ జరగడంలేదు సుమండీ. అదే కాలో కాలమహిమ అంటే...

పంతులు: చిత్తం.

రామ : నిజంగా సకాలంలో అన్నిపనులూ జరగ కూడదు సుమండీ. అప్పుడు జీవితం యాంత్రికంగా చప్పగా ఉంటుంది. చూడండి, మీరున్నారు అమ్మాయికి సంగీతం చెప్పదామని

వచ్చారు. వుంటే ఏం చేద్దురూ? శెప్పేవి చక్కా వెళ్ళిపోయి, మీ ఆవిడ అమర్చివుంచిన వేడివేడి భోజనం తినేసి బలేకంగా పడుకొని వుందురు. ఇప్పుడో అమ్మాయిరా లేదు. మీలో చిరాకు, కంగారు, అక్కడ మీ ఆవిడకి కించిత్ కోపం, వేడిఅన్నం చల్లారిపోవడం మీకూ మీ ఆవిడకీ చిన్న కలహం—మూకారా ఎంత రసోత్పాదన జరుగుతుందో!

పంతులు: (పళ్లికిలించి) చిత్తం!

రామ: (ఆలోచనగా.) పంతులూ, నాకు ప్రపంచంలో ప్రాణతుల్యమైనదేదో చెప్పగలవా.

పంతులు: (మాంచి ఉత్సాహంగా) డబ్బండి.

రామ: పటప్. నువ్వు కాక మరోకడైనా యిలా అనివుంటే డిస్మిస్ చేద్దును. నీ అంత బాగా వీణ వాయించేవాడూ నేర్పేవాడూ యింకోకడు యీ ఊళ్లో లేడు కాబట్టి నిన్ను క్షమించదలిచాను.

పంతులు: (భయంగా) నాదే తప్పండి. నన్ను మీరు క్షమించాలి.

రామ: నాకు ప్రపంచంలోకల్లా ప్రాణ సమానమైనది నా కూతురు సుచిత్ర. తల్లి పోయినప్పట్నుంచీ ఈ చేతులతో పెంచి పెద్దదాన్ని చేశాను. విద్యాబుద్ధులు గరిపాను. ఈ ధనమంతా ఆమె సుఖంకోసం, ఈ మేడలు ఆమె నివాసంకోసం, ఈ తోటలు ఆమె విహారంకోసం......

పంతులు: అమ్మాయిగారికి యుక్తవయస్సు వచ్చిందండి ఇంక వివాహం చేసెయ్యండి.

రామ: (హేళనగా) నువ్వు చేసుకుంటావా?

పంతులు: (కంగారుతో) నే నే... వాండి!

రామ: మరింకేం—మనం వివాహం చెయ్యడమేమిటోయ్ పంతులూ. అమ్మాయే వరుణ్ణి ఎంచుకుని వివాహం చేసుకోవాలి తప్ప. ఏమంటావ్.

పంతులు: చిత్తం.

రామ: చూడు, రెండువందల సంవత్సరాల క్రితం అభిప్రాయాలంటే నాకు అసహ్యంసుమీ.

పంతులు: చిత్తం.

రామ: ఒకమనిషి సగటున ఎన్నేళ్లు జీవిస్తాడంటావ్.

పంతులు: ఒక నలభై కట్టుకోండి.

రామ: ఒక యిల్లు ఎన్నాళ్ళు శిథిలం కాకుండా ఉంటుందంటావు?

పంతులు: నూరు నూటయాభై సంవత్సరాలనుకోండి గట్టిగా కట్టిన యిల్లయితే.

రామ: అయితే చూశావు. మనిషివుండడు, మనిషి కట్టిన యిల్లూవుండదు. అయితే ఆ బూజుపట్టిన అభిప్రాయాల్ని మాత్రం ఎందుకుంచాలీ అంట?

పంతులు: చిత్తం.

రామ: నీ కర్థమయిందా?

పంతులు: చిత్తం.

రామ: నీకర్థమయితే యీ వూళ్ళో యీ బోడి పేష్టరీ చేస్తూ ఎందుకుంటావు! ఏ స్టూడియో ఆర్కెస్ట్రా లోనో చేరి ఉండేవాడివి. ఇదిగో మాట. (పంతులు దగ్గరకి వస్తాడు. రామనాథం మెల్లగా) అమ్మాయి నాకు చెప్పింది తెలుసునా.

పంతులు: ఏమిటండీ.

రామ: అమ్మాయి ఒక చక్కని కుర్రవాణ్ణి ప్రేమించిందట. సమయం వచ్చినప్పుడు తనే అతని పేరూ ఊరూ చెబుతానంది.

పంతులు: అంతకంటె కావల్సిందేముందండి. శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు. త్వరలోనే ఏర్పాట్లు కానిచ్చెయ్యండి.

రామ: అదే చూస్తున్నాను. త్వరలోనే - ఎందుకూ యీ వేళే ముహూర్తం పెట్టించేస్తాను. అమ్మాయిని లాలించి ఆ కుర్రవాని పేరు కనుక్కుంటాను. (జేబు గడియారం చూసి.) పంతులూ యింక నువ్వువెళ్ళు. అమ్మాయి యిప్పట్లో వచ్చేటట్టు లేదు.

పంతులు: చిత్తం సెలవిప్పించండి. (నిష్క్రమిస్తారు.)

(రామనాథం తిరిగీ ఫైల్సు చూస్తుంటాడు. వడివడిగా సుచిత్ర వెనకాలే శేఖరమూ ప్రవేశం.)

సుచిత్ర: (కంగారుగా) నాన్నగారూ! చూడండి యితన్ని.

శేఖరం: (సుచిత్రకి సావకాశం యివ్వకుండా.) నమస్కారం. మీ అమ్మాయి సుచిత్రాదేవిగారు మీదగ్గర కార్యదర్శిపదవి ఖాళీగా ఉందని చెప్తే...

సుచిత్ర: కాదు నాన్నా కాదు...

శేఖరం: అహఁహఁ. మీకా సందేహం ఏమీ అక్కర్లేదు సుచిత్రా. ఏపనైనా సరే నమ్మకంగా చేస్తానండి.

సుచిత్ర: కాదు నాన్నా - వీరు నన్ను చెయ్యిపుచ్చుకుని...

శేఖరం: (అడ్డుపడి వేగంగా) అదికూడా చెప్పాలా సుచిత్రాదేవి. కారు వేగంగా వస్తుంటే మీ అమ్మాయిగారు రోడ్డు మధ్య పరధ్యానంగా ఉండడంచూసి చెయ్యిపుచ్చుకుని టక్కుని యివతలికి లాగి రక్షించానండి.

రాము: (తృప్తితో) ఎంతప్రమాదం తప్పింది. (శేఖరం చేతులుపట్టుకుని) నీ మేలు మరువలేను నాయనా.

సుచిత్ర: అంతా అబద్ధం, అంతా మోసం.

శేఖరం: ప్రపంచమే అంత సుచిత్రాదేవి. అవ్వే. ఆ డ్రైవరు తాను స్పీడుగా రావడంలేదనీ, హారన్ ఎన్నిసార్లు కొట్టినా మీ అమ్మాయే వెంకితనంగా రోడ్డుకి అడ్డంగా వయ్యారంగా నుంచుందనీ అన్నాడండి. రాస్కెల్. అంతా అబద్ధమూ మోసమూ. వాడు హారన్ కొట్టనే లేదు.

సుచిత్ర: (డీలా అయిపోయి తినేసేట్టు చూస్తుంది శేఖరాన్ని.)

రాము: ఈ డ్రైవర్లంతే నాయనా. నువ్వే కనక సమయానికి అక్కడలేకపోతే ఏమయ్యేదో తల్చుకుంటే-యిప్పుడే నరాలుపట్లు తప్పుతున్నాయి. అయితే నీ పేరు.

శేఖరం: శేఖరం అండి.

రాము: నిన్ను చూస్తే నాకొక సెక్రటరీ ఉండడం అవసరం అనే అనిపిస్తోంది. త్వరలో నే శుభకార్యం ఒకటి తలపెట్ట బోతున్నాను. ఈ ఊళ్ళో నాకు చాలా యిళ్ళున్నాయి. వాటి అద్దెలు వసూలు చెయ్యడానికి ఒక గుమాస్తా ఉన్నాడు కాని అతనంత సమర్థుడు కాదు. నువ్వైతే యువకుడివి. శక్తి సామర్థ్యంగలవాడివి. దానాదీనా నాకు సహాయంగా.

శేఖరం: నేనయితే అద్దెలు మంచి నిక్కచ్చిగా వసూలు చేస్తానండి. ఆ టెక్నిక్ అంతా నాకు బాగా తెలుసండి.

సుచిత్ర: అంత అవసరమా నాన్నా మనకి ఒక కార్యదర్శి?

రాము: ఆఁ! అన్నట్టు అమ్మాయికి అటువంటి ప్రమాదాలు రాకుండా చూడడానికీ,...

శేఖరం: (సంతోషంగా) అమ్మాయిగారిమీద యీగని కూడా వాలనివ్వనండి. ఆవిడని హమేషా కనిపెడుతూ ఉంటానండి.

రాము: జీతం ఏమాత్రం కావాలోయ్.

శేఖరం: మీ చిత్తం వచ్చినంత యివ్వండి. నాకు జీతం పట్టింపులేదండి. తమ వంటివారి దగ్గర కార్యదర్శినన్న గౌరవం చాలునండి.

రాము: శెభాష్! రూపానికి తగ్గ వినయంకూడా ఉంది. ఎంతవరకూ చదువుకున్నావు నాయనా.

శేఖరం: బి. యే. ప్యాసయ్యానండి.

రాము: బాగుంది. నెలకి నూటయాభై యిస్తాను.

శేఖరం: తమ కటాక్షం.

సుచిత్ర: (ఆశ్చర్యంతో) నూట యాభయ్యే...!

రాము: తక్కువంటావా తల్లి. నిన్ను రక్షించిన వాడు కూడా. పోనీ, రెండువందలు యిస్తాను. న్యాయంగా ఉంటుంది. (సుచిత్ర పళ్ళు పట పట కొరుకుతుంది. శేఖరం విజయగర్వంతో ఆమెకేసి చూస్తాడు.)

రాము: ఇదిగో శేఖరం—నాకు జీవితంలో రెండే రెండు ఆశయాలు. ఒకటి యీ ఆస్తిని అభివృద్ధి చేసి అది తరతరాలుగా నిలిచి ఉండేటట్టు కట్టుదిట్టం చెయ్యడమూ; సుచిత్రకి విద్యాబుద్ధులు గరపి తగిన వరుడికి యిచ్చి వివాహం చెయ్యడమూ. అల్లుడిచేతిలో కూతుర్నీ, కూతురిచేతిలో నా ఆస్తిపాస్తుల్నీ పెట్టి నేను రిటైరయి విశ్రాంతిగా ఉండదలచుకున్నాను.

శేఖరం: చాలా ఉదాత్తమైన ఆశయమండీ తమది.

రాము: నేనిందాకా చెప్పానుకదూ శుభకార్యమని. మా అమ్మాయి వివాహం పదిపదిహేనురోజుల్లో జరుపబోతున్నాను.

శేఖరం: (మొహంలో రంగులు మారిపోతాయి. కంగారుగా నత్తిగా.) వి...వా...హ మండి.

రాము: మంచి వైభవంగా జరిపిస్తాను. ఆ అరేంజిమెంట్లన్నీ నువ్వే చెయ్యాలి. ఒక డిన్నర్, ఒక డాన్సు, ఒక డ్రామా, ఒక బుర్రకథ, ఒక సంతర్పణ, ఒక సంగీత కచేరీ... యింకా...

శేఖరం: (అతనికి భూమి గుండ్రంగా తిరుగుతోంది.) ఎవరండీ వ...రు...డు?

రామం: అసంతా సెటిల్ అయిపోయిందిలే. అమ్మాయి స్వయంగా వరుణ్ణి ఎంచుకుంది.

శేఖరం: సెటిల్... సెటిల్... (తూలిపోయి కుర్చీని ఆనుకుంటాడు.)

రామం: అదేం—అలా అయిపోయా వేమిటి.

శేఖరం: అబ్బే కొంచెం తిప్పిందండి. అంతే—మిస్ సుచిత్రా దేవి. కొంచెం వాటర్ !

సుచిత్ర: వాటరేనా, మధ్యకూడా కావాలా పాపం! (వెళుతుంది.)

రామం: కూర్చోవోయ్ శేఖరం. దొడ్లో పని చేయిస్తున్నాను. ఒకసారి చూచివస్తాను. (వెళతాడు)

శేఖరం: (కుర్చీలో కూర్చుని మొహాన్ని చేతుల్లోకప్పుకుని) మైగాడ్.

సుచిత్ర: (నీళ్లతో ప్రవేశించి) ఇదిగో మిస్టర్ సెక్రటరీ, వాటర్. (గ్లాసు బల్లమీద పెడుతుంది)

శేఖరం: (కోపంగా చూసి గ్లాసుడునీళ్లూ గడగడా తాగేస్తాడు) హుం!

సుచిత్ర: (ఎదురుగా కూర్చొని) కాగితం కలం తీసుకోండి. నా మ్యారేజికి కావలసిన వస్తువుల లిస్టు చెబుతాను.

శేఖరం: (కదలడు)

సుచిత్ర: మీకే చెబుతూన్నది!

శేఖరం: (మాట్లాడడు. కుర్చీ మరోకపక్కకు త్రిప్పుకొని కూర్చుంటాడు)

సుచిత్ర: మీకు జీతం ఇచ్చేది ఎందుకో తెలుసా? చెప్పినట్లు చెయ్యడానికి.

శేఖరం: నేను వ్రాయను.

సుచిత్ర: ఏం?

శేఖరం: నా ఇష్టం.

సుచిత్ర: మీయిష్టం మీయింటిదగ్గర. అయితే ఉద్యోగము మానెయ్యండి.

శేఖరం: నాకు ఉద్యోగం ఇచ్చింది మీరుకాదుగా.

సుచిత్ర: ఎవరైతే నేం—ఇక్కడ నా మాట రాజాజ్ఞ. లేకపోతే డిస్మిస్ చేయిస్తాను.

శేఖరం: వెధవ వుద్యోగం. మీరు చెప్పినట్టల్లా వినడానికి నే నేమీ తమ నౌకర్ని కాను. వస్తాడుగా ఓ దబట పదిరోజుల్లో తమ భర్తనంటూ! వాడికి పురమాయించు నీ పనులన్నీ.

సుచిత్ర: (కోపంతో) యూ షటప్. నాకు కాబోయే భర్త నవమానిస్తే కథ చాలాదూరం వెళుతుంది. నాభర్త నాకు దైవసమానుడు. మీ అంతస్థు తెలుసుకొని జాగ్రత్తగా మాట్లాడండి.

శేఖరం: ఇక నాకు జాగ్రత్త లేదు. నాకాశ లేదు. నా గుండె మండిపోతోంది. నేను మానవుణ్ని కాను, రాక్షసుణ్ని. విప్లవమూర్తిని. సుచిత్రా! ఏ దేవిని నేనుసర్వస్వం అని ఆరాధించానో, ఏ దేవి నవ్వుకోసం, కరుణాకటాక్షం కోసం తల్లడిల్లిపోయానో—ఆమె నన్ను ఓ అనామకుడిలా పురుగులా విదిలించి పారేసింది. నాకింక మంచీ చెడ్డా పాపం పుణ్యం విచక్షణ లేదు. ఎప్పటికైనా నా పగ తీర్చుకుంటాను. నిన్నూ నీభర్తనీ కట్టకట్టి గోదావరిలో ముంచేస్తాను.

సుచిత్ర: (ఫక్కున నవ్వుతుంది)

రామం: (వస్తూ) ఎందుకమ్మా అలాగ నవ్వుతున్నావు.

సుచిత్ర: 'తిరస్కరింపబడిన ప్రియుడు' అనే నాటకంలో పోర్షన్ చెబుతున్నారు నాన్నా వీరు. వీరు నాటకాల్లో వేషాలు బాగా వేస్తారులే.

శేఖరం: అవునండి. మీ అమ్మాయి చెప్పిన నాటకం కట్టి విషాదాంతం అయిపోయిందండి. అందులోని హీరోయిన్ చాలా దుర్మార్గురాలండి. వంచకురాలండి. గోముఖ వ్యాఘ్రమండి.

సుచిత్ర: హీరో అంతకన్న దగాకోర్, రోంగ్, లోఫర్ ...

రామం: హీరో హీరోయిన్లు ఎటువంటి వాళ్లయితే నేం తల్లీ. ఇంతకీ నాటకం కదా.

శేఖరం: వాస్తవిక జీవితంలో కూడా ఉంటారండి అటువంటి మోసకత్తెలు.

సుచిత్ర: అటువంటి తెలివి వ్రాసిన కర్తలున్నా...

రామం: నేను మీ ఇద్దరితో నూ ఏకీభవిస్తాను. సరేనా... (సుచిత్ర కోపంగా కూర్చుంటుంది. శేఖరం అంతకన్న కోపంగా కూర్చొని టేబిలుమీద న్యూస్ పేపరు చదువుకున్నట్లుగా నటిస్తాడు. కాని అతని మొహంలోని బాధని దాచాలని ప్రయత్నం. ఇదే సమయంలో గుమాస్తా సోము యాజులు వస్తాడు. పేపరు అడ్డంగా ఉండడం వలన శేఖరాన్ని చూడలేదు; శేఖరమూ సోము యాజుల్ని చూడడు.)

సోము: నమస్కారమండి. ఈరోజున అయిన వసూళ్ల మొత్తమూ రసీదులూ చిత్తగించండి. (బల్లమీద ఉంచుతాడు)

రామ: (రసీదుల్ని చూసి) ఇంకా ఏమైనా రావల్సినవి ఉన్నాయా?

సోము: (భయంగా) బాబూ. ఒక్కడి విషయములో మాత్రం చాలాకష్టంగా వుంది. అతను ఈ ఏడాది నుంచీ అద్దెయివ్వడం లేదండి. నాలుగు రోజుల నుండి మనిషీ పత్తాలేకుండా పోయాడు. గొప్ప కేటుగాడులెండి.

రామ: కేటుగాడా? అంటే?

సోము: చిత్తం. అది నూతనంగా మన భాషాకోశంలోకి వచ్చిన పదమండి. మోసగాడనీ, అసలైన గిరీశం మార్కు దగాకోరనీ అర్థమండి.

రామ: (చిరాగా కోపంగా) ఎంత ఇవ్వాలి.

సోము: నెలకి రెండుగదులకీ పదిహేను రూపాయలు చొప్పున పదమూడు నెలలకి నూటతొంభై అయిందండి.

రామ: పెద్ద మొత్తమే యివ్వాలి. కుటుంబంతో ఉన్నాడా?

సోము: రామ రామ. పరమబ్రహ్మచారి గాడండి.

రామ: అయితే రెండుగదు లెందుకు.

సోము: మొదట నాకూ ఆ సందేహమే కలిగిందండి. చాలాకాలం వరకూ అర్థం కాలేదండి. బాకీల వాళ్ళు వస్తే లోపలిగదిలో దాక్కుంటానికి ప్రత్యేకంగా రెండవగది కూడా తీసుకున్నట్లు కనబడుతోందండి.

రామ: ఇన్నాళ్ళూ ఏం చేస్తున్నావయ్యా. ఎందుకు నాకు ముందుగా అతన్నిగురించి చెప్పలేదు. అతనెందుకు? ఏమయ్యాడో పోలీసుల్ని పిలిపించి పట్టించక పోయావా అంట! ఏమయ్యోయ్ సోమయాజులు, సాయంత్రం లోపుగా అతనెక్కడున్నాడో వెదికి పట్టుకుని వసూలుచేసి తీసుకురా. లేనిదే నీ జీతంలోంచి విరగ్గోస్తాను.

సోము: బాబూ—తమరు అలాగంటె ఏంచెయ్యగలను. ఆ వేషం భాష పిలజమీందారులా వుండేవాడు. ఆ దర్జా కళ, కీపీ చూసి ఒత్తిడి చెయ్యలేక పోయేవాణ్ణి, ఎప్పటికప్పుడు మహానమ్మకంగా తియ్యగ నచ్చచెప్పేవాడు బాబూ. ఇంతకీ నా ఖర్మ.

రామ: అంతే నామాటకి తిరుగులేదు. సాయంత్రం లోపుగా వసూలుచేసి యివ్వకపోతే నీకు జీతం ముట్టదు—(కోపంగా లోపలికి వెళ్ళిపోతాడు.)

శేఖరం: (పేపరు అడ్డంగా ఉంచెగానే) నేనయితే ముక్కుపిండి వసూలు చేసేవాణ్ని. ఏడాది నుంచి అద్దెవసూలు చెయ్యలేక పోయాడుట. ఎగసెండీ అదకట. (పేపరు తీసి సోమయాజుల్ని చూసి వెర్రిగా కేకేస్తాడు) ఓహో!

సోము: హరి నిన్న తెలెరయ్య నువ్వా (గట్టిగా, రామనాథంవెళ్ళిన వైపు చూసి) అయ్యా రామనాథంగారూ ఏమేవండీ ఏదే—ఇక్కడే డైరా యించాడు పీకి పారేరణ!

శేఖరం: నువ్వా మహానుభావా. నేనున్న ఆయిల్లు నీ స్వంతం అని చెప్పావే!

సోము: చిత్తం గిరీశంగారూ, యిల్లెవరిదైతే నేం. అద్దె మాట ఏం చెప్పావ్.

శేఖరం: అసలు నువ్వెవరు నన్నడగడానికి.

సోము: నేనా నేను రామనాథంగారి గుమాస్తాని.

శేఖరం: నీజీతం ఎంత?

సోము: అదంతా నీకెందుకోయ్. నీ ముష్టిబతుకుకన్నా వెయ్యిరెట్లు నయం. నీకులాగే దొంగబతుకూ లంజబతుకూ కాదు మనది. వంద రూపాయలు నికరమైన జీతంనాకు. కష్టపడి చెమటోర్చి సంపాదించినది నాయనా—ఇదేం యాచన కాదు.

శేఖరం: తెగనయ్యా సోమయాజులు! నే నెవర్నో తెలుసా.

సోము: తెలిసుకోం—బడుద్దాయివి.

శేఖరం: నేను రామనాథంగారి సెక్రటరీని. మనజీతం నెలకి రెండువందల రూపాయలు. నీ గ్రేడు నా గ్రేడు కన్న సగంలో సగం తక్కువ. నీ సుపీరియర్ ఆఫీసర్ని కాబట్టి రెండు లెంపలూ వాయించుకొని నమస్కారం చేసి అలా నిలబడు. స్టాండ్ ఎటెన్షన్!

సోము: వేళాకోళంగా ఉందే నీకు. జాగ్రత్త. అద్దె యిస్తావా, తోలు వొలిపించెయ్యమన్నావా. (పంచె సరిచేస్తాడు)

శేఖరం: (చొక్కా చేతులు పైకిలాగి) ఒరేయ్ గుమాస్తా రారా! నీకుండు శామనిపించేస్తాను.

సోము: (రామనాథం రావడంచూసి) అయ్యా వీరేనండి ఆగిరీశం.

శేఖరం: నా పేరు శేఖరం.

సోము: యీడాది అద్దె ఎగ్గొట్టిన మహానుభావుడు వీరే నండి బాబూ.

రాము: ఇతనా (తెల్లబోతాడు)

సోము: పైగా మీద మీదకి వస్తున్నాడు. అయ్యా సెలవిప్పండి. ఒక్క దెబ్బతో యిలాగట్టే భూమ్మీదకి రప్పిస్తాను.

సుచిత్ర: (ఇంతవరకూ వినోదంగా చూస్తోన్న సుచిత్ర పరిస్థితి దాటుతోందని గ్రహించి) వీరేనా నాన్నా వీరే...

శేఖరం: రామనాథంగారూ. నేను నిజం చెప్పేస్తున్నాను. నేను మీ అమ్మాయిని సుచిత్రని యీ రెండేళ్ళనుండీ ప్రేమిస్తున్నాను. ఆమె దయని సంపాదించాలని అన్నీ వదిలేసి యీ వూళ్లో ఉండిపోయాను. దబాయించి యీ సోమయ్యని మోసగించి ఏడాదినుంచీ అద్దె యివ్వకుండా కాలక్షేపం చేశాను. నేను బి యే ప్యాసయాను నేను దరిద్రుణ్ణి, లోభిని. నిజమే. కాని ఒక్క అరగంటవరకూ సుచిత్రాదేవితో సన్నిహితమైనా జీవించాలనే ఆశ ఉండేది. కాని ఆ ఆశ యిప్పుడు సమూలంగా నాశనమయింది. నా మోహాన్ని, నా అల్పత్వాన్ని మీరు ప్రత్యక్షంగా చూసికూడా నన్ను క్షమించి మీ అమ్మాయిని నా చేతుల్లో పెట్టరు. ఇన్నాళ్ళు నేను పడిన శ్రమకీ మీ అమ్మాయి హృదయంలో సూదిమోపినంత చోటుకూడా సంపాదించుకోలేకపోయాను. అందని ద్రాక్షకి అర్రులుచాచాను. విఫలమైన యీ ప్రేమ నన్ను దహించివేస్తోంది. నేను తెగించిన మనిషిని. నాకు చావంటే భయం లేదు. కాని యీ సోమయ్య నన్ను సుచిత్రాదేవి ముందే అవమానించాడు. అది మాత్రం సహించలేను. ఈ సోమయ్యని చంపేసి మరీ చచ్చిపోతాను. గుడ్‌బై సుచిత్రాదేవీ. రారా సోమయ్యా (మీదకి వస్తాడు.)

సోమయ్య: ఏం చేస్తావురా. (మీదకొస్తాడు.)

సుచిత్ర: (కంగారుగా.) నాన్నా వీరు...వీరు.

రాము: (వినిపించుకోక) ఇది యిల్లనుకున్నారా వడి బజారనుకున్నారా! (బల్ల గుద్దుతాడు)

సోము: ఆగండి బాబూ. వీడిపొగరు ఓ పది టొన్నులు తగ్గించేస్తాను. మీరు చూస్తూ ఉండండి.

(ఇద్దరూ కలియబడతారు. సుచిత్ర టేబిలుమీది రూళ్ళకర్రతీసి ముందుకువచ్చి సోమరాజులు చెతిమీద కొడుతుంది.)

రాము: అమ్మాయ్ మన్నెలారా. నీ కెందుకు!

సోము: (విస్మయంతో) అమ్మాయిగారా! అబ్బ! నన్ను కొట్టారేమిటి తల్లీ.

సుచిత్ర: ఇంకా చంపేదును జాగ్రత్త. ఆయనెవరో తెలుసునా. ఆయనే నాకు కాబోయే భర్త.

రాము:<br>
సోము: } —ఆఁ!<br>
శేఖరం:

సుచిత్ర: (శేఖరం చెయ్యిపట్టుకుని.) నేను నీకిదివరకు చెప్పింది వీరి నే నాన్నా.

రాము: (నమ్మలేక) యితనా! అమ్మా, నువ్వు పొరపాటుపడడం లేదుకదా!

సుచిత్ర: నాన్నా. వీరినిగురించి నీకు సరిగ్గా తెలియదు. వీరు ఫస్టు క్లాసులో ప్యాసయారు నాన్నా.

రాము: (సందేహిస్తూ) సరిగా ఆలోచించుకున్నావా అమ్మా.

సుచిత్ర: (లాలిస్తూ) ఆయన చాలా మంచివారు నాన్నా. నా మాట కాదనకు నాన్నా.

రాము: (శేఖరంతో) ఇదిగో చూడు నీ తండ్రి పేరు.

శేఖరం: బ్రహ్మానందం అండి.

రాము: బ్రహ్మానందంగా ఉండదోయ్. సరే నీ జీవితాశయం ఏమిటి?

శేఖరం: ఇంతవరకూ సుచిత్రాదేవిని వివాహం చేసుకోవడమేనండి.

రాము: ఆ తర్వాత?

శేఖరం: సుచిత్రాదేవిని ప్రతి క్షణమూ సంతోషపరచి ఆమె కదలికలో కవిత్వాన్నీ కనుచూపులో స్వరాన్నీ సృష్టించడం.

రాము: అంటే ఒక స్త్రీ కోసం నీ జీవితం అంతా వ్యర్థపరుస్తావన్నమాట.

శేఖరం: నాకు కోపం తెప్పించకండి జమీందారుగారూ. సుచిత్ర సామాన్య మానవస్త్రీ అంటే నేను సహించను.

రాము: భేష్ బాగా చెప్పావు. ఇది నీ ప్రేమకి నిదర్శనం అవడానికి సందేహంలేదు. సరే, నీకు వ్యసనాలేమైనా ఉన్నాయా.

శేఖరం: చాలా ఉన్నాయండి.

సుచిత్ర: (తండ్రి భుజంమీద తల ఆన్చి) మా నాన్న చాలా మంచివాడు.

శేఖరం: (నమస్కరిస్తూ) మీకూ మీ విశాల హృదయానికీ ఆ జన్మాంతం కృతజ్ఞుణ్ణి మామగారూ!

సోము: రొట్టె విరిగి నేతిగా చేతిలో పడిందయ్యా శేఖరం బాబూ. అరనిముషం క్రితం అనాథవి. ఇప్పుడు శ్రీ శ్రీ జమీందారు గారి అల్లుడివి. ఓహోహో అదృష్టవంతుడివి. నూరేళ్లు సుఖంగా బతుకు నాయనా.

రాము: చూడు శేఖరం. వారం పదిరోజుల్లో మంచి ముహూర్తం వుంది. నేను వెళ్ళి సిద్ధాంతి గారితో ఆలోచించివస్తాను చూడు నాయనా ఈ సమాజంలో వుండే కర్తవ్యతత్వాలన్నీ ధనికుల దరిద్రుల అంతరాన్ని లెక్క చెయ్యనిది దాటగలిగినదీ ఒక్కటే వుంది. అది ప్రేమ. దాంపత్యాన్ని పవిత్రం చేసేది, స్వర్గం చేసేదీ ప్రేమే. కాని ప్రేమని ధనంతో విలువకట్టి కట్నాల రూపంలో కులాహంకార రూపంలో ప్రదర్శించే యీనాటి పెద్దలతో నేను ఎప్పుడూ ఏకీభవించలేదు. నా వయస్సు ముసలిదైనా మనస్సుమాత్రం సత్యంకోసం అన్వేషిస్తుంది. ఇదిగో యీ సొమ్ము దగ్గర ఉంచుకో. నీ దుస్తులకీ అవసరాలకీ ప్రస్తుతం ఖర్చుపెట్టుకో. రావయ్యా సోమయాజులూ. అలాగ పోయి వద్దాము.

సోము: (శేఖరాన్ని సమీపించి) అమ్మాయి సుచిత్రా కలిసి, చక్కని రీలాంటి మొగుణ్ణి సంపాదించుకొన్నావు. నేను మొదటే అనుకున్నాను శేఖరంబాబుని చూసి — ఆ దర్జా, ఆ కళ అంతా యోగజాతకుడని చెప్తూనే వుంది. శేఖరంబాబూ, అమ్మాయిగారు కోటి కేకొట్టారు కాని ఏదైనా నా సంచిబహుమతీ యిప్పించు. నీ పేరు చెప్పుకుంటాను. అందులోనూ పిల్లలు లేని వాణ్ణి, ఖర్చు ఎక్కువ! వస్తానుబాబూ.

రాము: (సోమయాజులుతో వెళ్ళుతూ) అమ్మా శేఖరానికి ఏం కావాలో అన్నీ జాగ్రత్తగా చూడు. వస్తాం. (నిష్క్రమిస్తారు)

శేఖరం: సుచిత్రా ఈ ప్రేమదాసుడు ధన్యుడు. (ఇంగ్లీష్ ఫాషన్‌లో ఒక మోకాలిమీద కూర్చుని సాల్యూట్ చేస్తాడు.)

సుచిత్ర: ఎవరైనా చూస్తే నవ్వుతారు లేవండి. ఇదేమైనా నాటకంస్టేజి అనుకున్నారా.

శేఖరం: స్టేజికాదు. ఇది స్వప్నం. ఇది యమునానదీ తీరం. నువ్వు రాధవి, నేను కృష్ణుణ్ణి. ఇది వైజయంతి. నువ్వు శచీదేవివి. నేను దేవేంద్రుణ్ణి. ఇది పాతాళలోకం. నువ్వు ఉలూపివి, నేను అర్జునుణ్ణి.

సుచిత్ర: ఇది భూలోకం నేను సుచిత్రని మీరు శ్రీ శ్రీ శేఖరం.

శేఖరం: ఎంతగమ్మత్తు చేశావు సుచిత్రా. నేనంటే నీకు మొదటినుంచీ యిష్టంఉండే యింతనాటక మాడావా.

సుచిత్ర: ఇష్టంలేనిదే ఏఆడది మీలాగ ప్రేమలేఖలు రాస్తుంటే కోపంకాస్తుంటే ఊరుకుంటుందండీ కాని చాలా కాలం మీ ప్రేమయొక్క నిజాయితీని శంకిస్తూ వచ్చాను. ఉడుకైన వ్యామోహమేమో, లేక నా ధనంమీదగల ఆశో అని అనుకున్నాను. అందుకే యిన్నాళ్లు మీకు కఠిన పరీక్ష. (అతని జుట్టులోకి వేళ్ళుపోనిస్తూ) పాపం ఎన్నికష్టాలుపడ్డారో కదా.

శేఖరం: కష్టేఫలేఅన్నారు పెద్దలు. ఈ శేఖరం శ్రమ ఫలించింది. అనన్యసాధ్యమైన రత్నాన్ని పొందగలిగాను. ఎన్ని అఘాతాలు కలిగినా ప్రమాదాలు వాటిల్లినా నిష్పృహ చెందలేదు. ఆశ వదలలేదు. పరిస్థితులకి లొంగిపోవడం ధీరుడిలక్షణంకాదు, ఓటమిని అంగీకరించడం వీరుడిలక్షణంకాదు. హోప్ ఫరెవర్ హోప్ యిదే శేఖరం నినాదం.

సుచిత్ర: మీరలాగ గంభీరంగా మాట్లాడుతూంటే ఎంతో అందంగా ఉంటారండీ.

శేఖరం: (నవ్వి) అది రాజకీయ వేత్త లక్షణం.

సుచిత్ర: అంటే—

శేఖరం: అనర్గళంగా గంటలకొద్దీ ఉపన్యాసం దంచెయ్యడం; ఎంతపిండినా సారం ఒక్క చుక్క కూడా రాలకూడదు.

సుచిత్ర: కొంపతీసి మీరు మంత్రులవరుకదా!

శేఖరం: నీకాభయం అక్కరలేదు. నీ సన్నిధానమూ నీ దరహాస చంద్రికలూ వదలి ఆ విధాన సౌధంలో మా రసహీనమైన ప్రణాళికలతోనూ కూర్చుంటానా నెవర్. నెవర్.

సుచిత్ర: హమ్మయ్య, ఇంక భయపడ నక్కర్లేదు.

శేఖరం: సుచిత్రా, వివాహం అవగానే హనీమూన్ మాటేమిటి.

సుచిత్ర: హనీమూన్—ఏం యిక్కడ ఉండకూడదా.

శేఖరం: రెండేళ్లనుంచీ చూస్తోన్న యీ రోడ్లనీ, మురికికాల్వలని, రోజూ మీ నాన్ననీ

సోమయ్యనీ చూస్తూ వివాహోత్సవ ప్రథమ దినాన్ని గడుపుతున్నారా. వద్దు వద్దు సుచిత్రా మన యిద్దరి ప్రేమకథా కలలమధ్య యీపాడు నీడలు పడకూడదు.

సుచిత్ర: (ఆలోచించి) అయితే కాశ్మీర్ పోదామా.

శేఖరం: వండర్ఫుల్. ఆ కాశ్మీరపు లోయల్లో.

సుచిత్ర: ఆ హిమవత్ పర్వత సన్నిధానంలో.

శేఖరం: సెలయేళ్ళ పక్కన.

సుచిత్ర: జలపాతల దిగువన.

శేఖరం: రంగు రంగుల పుష్పాల తోటలలో.

సుచిత్ర: మంచు కప్పిన తెల్లని బాటలలో.

శేఖరం: నువ్వూ నేనూ.

సుచిత్ర: అబ్బ చాలా బావుంటుందండీ. దట్ కాశ్మీర్ — యిదే మన నివాసం.

శేఖరం: (కళ్ళు నులుముకుని) ఇది స్వప్నమా లేక — ఇప్పుడెక్కడున్నాను సుచిత్రా.

సుచిత్ర: లేవండి. లేవండి. భోజనానికి వేళయింది, అల్లుడుగారికి.

రాము: రావండి. ఈ కాలపు కుర్రవాళ్లు రాత్రింబవళ్లు చదివి పరీక్షలు వ్రాయడం, జీవితంలో ఏ ఉద్రేకమూ వెలుగు లేక ఆఫీసు కుర్చీలకి జీవితం అంకితం చెయ్యడమూ తప్ప ఏ ప్రత్యేకతనీ ప్రదర్శించలేకపోతున్నారు. అయితే చెప్పు నీ వ్యసనాలన్నిటినీ—

శేఖరం: వాటిని చెపితే యీ రోజుకి తెముల్తుందండి. నాకు లేని వ్యసనమేమిటో తెలుసుకోవాలని పురజనులందరూ ఒక కమిటీని వేసినట్లు తెలుస్తోందండి.

సోమయ్య: ఆరి పిడుగా! ఏం వగరూ బెగురూ లేకుండా చెపుతున్నాడు. జమీందారుగార్ని చూస్తే నా నాలికమీద అక్షరాలు అక్షరాల్లానే గడ్డకట్టుకుపోతాయి.

సుచిత్ర: ఉత్తిది నాన్నా. వీరికి సిగరెట్ తప్ప ఏ వ్యసనమూ లేదు.

రాము: అయితే ఉన్నాయని అబద్ధం ఆడావన్నమాట!

శేఖరం: అదేనండి నా వ్యసనం. అబద్ధం మంచి సరదాగా మంచి నీళ్ళప్రాయంగా ఆడగలనండి.

రామనాథం: (సడెన్ గా వేళాకోళం ఆపేసి తీవ్రంగా) ఏమోయ్ శేఖరం. అబద్ధాలాడటం మనిషి యొక్క గౌరవాన్నీ ఆత్మవిశ్వాసాన్నీ తేలిక చేస్తుందా. నీలాంటి ఆశయాలేని వాడికీ, అబద్ధాలాడే వాడికి నీతినియమం పాటించని వాడికీ ఏ తండ్రైనా తనకన్న కూతుర్ని యిచ్చి పెళ్ళి చేస్తాడంటావా.

శేఖరం: (ఈ మాటకి కంగారుపడి) దొరికాంరా దేవుడా! (ధైర్యం తెచ్చుకొని) నేను నన్ను గురించి అంతా నిజం చెప్పేస్తాను. అబద్ధాలాడినా, ఆడంబరం చూపినా ఒకరికి హాని చేయాలనే దురుద్దేశ్యంతో కాదు. మీ అమ్మాయి కోసం. నిరాధారమైన బ్రతుకు సాగించినదీ, నానా పాట్లు పడినదీ మీ అమ్మాయికోసం. తరువాత మీ యిష్టం.

రాము: సోమరాజులా ఇలా రా! (సుచిత్రా శేఖరమూ ఆత్రుతతో చూస్తుంటారు) ఇతని అర్హతానర్హతలు ఒకసారి పరిశీలిదాం. ఈ రెండేళ్ళూ దమ్మిడీ సంపాదన లేకపోయినా దర్జాగా కై బతకగలిగిన చెయ్యా.

సోమయ్య: (వేలుముడిచి) ఒకటి.

రాము: ఎన్నికష్టాలు ఎదుర్కొనవలసి వచ్చినా నవ్వుతూ జీవితాన్ని సాఫీగా గడిపేసే చాతుర్యమూ.

సోమయ్య: రెండూ.

రాము: అమ్మాయి సుచిత్రకోసం ప్రాణాలైనా యివ్వగలిగిన తెగింపూ.

సోమయ్య: మూడూ.

రాము: అమ్మాయి యితన్ని గాఢంగా ప్రేమించడమనే ముఖ్యాతి ముఖ్యమైన పరిస్థితి.

సోమయ్య: నాలుగూ.

రాము: వీటన్నిటినిపట్టీనూ నేను నా తల్లి సుచిత్రని ఈ శేఖరానికిచ్చి వివాహం చేయడానికి నాకు అభ్యంతరం ఏమీ లేదు. మర్యాద లోపమైతే (శ్రీ) మీ మామగారికి కోపం వస్తుంది.

శేఖరం: ఒక్క నిముషం ఆగు. (ముందుకువచ్చి) సోదర సోదరీమణులారా. (పాంటుజేబులోంచి ఒక తాపుకాగితం తీసి చూపిస్తూ) ఇక నేను తీసుకున్న చేబదుళ్ల జాబితా. ఒకఅణాకు పైనుంచి తీసుకున్న అప్పులన్నీ ఆకారాది. నిద్రయందునూ కలలో జాగ్రతగా రికార్డు చేయబడ్డాయి. ఈ రెండేళ్లనుంచీ నాకు కాతాలిచ్చిన కాఫీ హోటళ్లకీ, లాండ్రీషాపులకీ సోడాషాపులకీ సర్వదా కృతజ్ఞుణ్ణి. వారందరి జాలలో శ్రీమతి సుచిత్రా దేవికీ నాకూ వివాహం జరుగబోతోంది. ఏతత్ వివాహానికి మీరందరూ ఏకకుటుంబ బంధుమిత్ర సపరివారంగా విచ్చేసి మదర్పిత చందనతాంబూలాదుల స్వీకరించి వధూవరుల నాశీర్వదించి మీమీ బాకీలు వసూలు చేసుకోవ ప్రార్థన. నమస్తే.

సుచిత్ర: నమస్తే.

[సుచిత్రా శేఖరం చెట్టాపట్టాలు వేసుకుని వెళ్ళిపోతారు. తెర]

# నిర్వేదము

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

ఎచ్చట నుంటివయ్య పరమేశ్వర! వీనిని కావ్యలోక మం
దిచ్చకువచ్చినట్లు విహరింపగ నీయక సేవకత్వమే
పుచ్చుకొనంగ నాజ్ఞ నిడబూన, రసాబ్ధులు నీపదమ్ములన్
విచ్చిన నన్నజాజియరవిందములన్ కొలువంగనెట్టులో॥

భాగ్యముతోడ నీచరణ పద్మములన్ సతతమ్ము కొల్వగా
యోగ్యతఁగల్గ నిచ్చిన మహోజ్జ్వల నూతన సత్కవిత్వ సౌ
భాగ్యమున్ ఉదాత్త రసవార్నిధి తేలెదగాని, వట్టిదా
ర్భాగ్య జగమ్మునన్ నిలువ వచ్చునె? యేకనిమేషరక్తికై॥

ఆశయముల్ హిమాలయ శిఖాగ్రములన్ బురుడించుగాని, నన్
ఏ శని పట్టెనో మొదటి కేనియు నించుక చేరలేక, నా
యాశల నీటగల్పుకొని యంధుఁడనై యిట కూలియుంటినో
ఈశ! పరేశ!! నన్ను కరుణించి యొసంగుమ పూర్వసంస్కృతిన్॥

ఈ యెద నొక్కమారు పరికింపుము, నాదు దురంత వేదనన్
వ్రాయగజాల పద్యముల స్వామి! అశక్తుడ నంచు తెల్పగా
నా యభిమానమున్ వదలినాడనులే!! యిక శంక లేల, నే
నీ యనురాగ గీతకమనీయసుధారసమానెదన్ ప్రభూ॥

ఈ గుదిబండ దాల్చి యిక యెన్ని దినాలని జీవితమ్ము నే
లాగగలాడ తండ్రి? కనులం జలియించుచునుండె ప్రాణమే
లాగుననైన బ్రోవగ తలంపనిచో నిముసమ్ము యేని నే
నాగగ జాలనట్టి చలితాత్ముడ నైతినయా! పరాత్పరా॥

ఆశరదిందు చంద్రికల ఆసిక తాతలవేది జేరి నా
ఆశల నెల్ల నీకు తెలియంగ కవిత్వమునల్లి, అల్ల ఆ
కాశమునందు తారకల గానముతో శ్రుతిగల్పునట్టి భా
గ్యాశయ మబ్బునయ్య పరమాత్మ!! నిమేషపు జీవితమ్ములోన్॥

ఆశయహీన జీవితమె హాయిగ నున్నటు తోచు, వెఱ్ఱి యా
వేశము పెచ్చుమీఱ వినువీథిని సౌధము పైన సౌధముల్
కౌశల మొప్పగట్టితి సుఖమ్మగ నుందమటంచు, నింతలో
రాశిగఁ జేసి యన్నిటి పరాత్పర!! రంజిలుచుందు వాత్మలోన్॥

నీవే నేనయి నేనె నీవయగుచున్ నిత్యప్రబోధమ్ములో
భావావేశ రసైక జీవిత సముత్పన్న ప్రమోదమ్ముతో
నీ విశ్వమ్మున నుండు భాగ్య మది లేనేలేక యల్లాడు నే
నీ వాత్సల్యరసమ్ము నానుటకు తండ్రీ! ఎంతో కొట్టాడెదన్॥

జీవిత మగ్గలం బగుట జీవికయంత్రమునందు జిక్కి, నా
నా విధమైన యాతనల నల్గి కృశించితి తండ్రి! నూత్న సం
జీవిని నిచ్చి సంస్కృతి విశేష సమంచిత దివ్యమార్గ సం
భావితుఁ జేయ వేడెద కృపారస వీక్షణ! సాధురక్షణా॥

నాదు జీవిత మనెడి విషాద గీతి
నీవు రచియించి నా కిడినావు గాని
శిథిల మౌట ఆలాపన సేయజాల
దీ హృదయవీణ, నీవు ప్రేమించునటుల॥

ఎన్నటికినైన వికసించు నీ యెడంద
మొగ్గయని తలంచితిగాని మోసపోతి
అమిత కఠిన కర్కశహృదయమ్మునోడ
తోడిమవఱకును దీనిని త్రుంచినావు॥

ఏమి మూటగట్టెదవు? కానిమ్ము సామి!
ఆగిపోవదు క్షణమాత్రమైన జన్మ—
ఈ విషాదాశ్రువులను జీవించువాడ
సతతమును నీదు నామసంస్మరణతోడ॥

# మర్యాదలు

శ్రీ జూనూతల వేంకటరామమూర్తి

'చదువుకున్నందుకూ, ఉద్యోగాలు వెలిగిస్తున్నందుకూ మనం ఒకరికయినా కొత్త సాయం చేస్తే దేశంలో ఇంతింత లావాటి సమస్యలు ఉత్పన్నం కావేమో! వచ్చినా సులభంగా తేలిపోతవి!'

'కావేమో!' పరధ్యానంలో అన్నాను.

'నేనెంతటి ముఖ్య విషయం తెలుపుతున్నానో నీవు అర్థం చేసుకునే స్థితిలో పూర్తిగా లేవని నమ్ముతాను. కట్నాలు ఇచ్చుకోలేక పెండ్లికి వాయిదా పడుతూంటే, చాటున కన్నీళ్లు తుడుచుకుంటూ ఎంతగా గిలగిలాడుతూ, ఎందరు తపించిపోతూ మగజాతిని శపించి వేస్తున్నారో ఎప్పుడేనా ఊహించడం జరిగిందా? నేను కండారా చూశాను!'

'లేదు!' అంటూ కండ్లు వాడివేపుకు తిప్పాను. నందకుమార్ కండ్లలో ఎఱ్ఱటి జీరలు - మామూలుగా ఉండేవే కనిపించాయి. కండ్లు ఎఱ్ఱటి జీరలతో ఉండటం భాగ్యచిహ్నమని వాడు తరచు అనేవాడు. కుమార్ మళ్ళీ మొదలెత్తాడు, 'కనీసం ప్రతియువకుడు కట్నం తీసుకోనని ఎందుకు తీర్మానం చేసుకోరాదూ?

'ఈ విషయంలో ఒక చట్టంకూడా ఉంది. ఇది చాల పాతపాట! ఇంతకూ నీవు తీసుకోడం జరిగిందా?'

'ఆఁ మనసా నిశ్చయించాను. రేపు ఇరవైరెండు నా పెండ్లి!' అనేసి నందకుమార్, పిలుస్తున్నా వినక వెళ్లిపోయాడు.

నేను ఆశ్చర్యంతో కూర్చుండి పోయాను!

అతి మామూలుగా వాడి పెండ్లి జరిగిపోయింది, కాబట్టి అర్భాటంగా నేనూ చెప్పడంలేదు. పసుపు డాగులయిన బట్టలతో, శిరస్సునుండి బియ్యం రాలుతూంటే చిరునవ్వులతో సరాసరి నా దగ్గిరకు వచ్చి, 'ఎల్లా ఉందిరా?' అన్నాడు నందకుమార్.

'ఏమిటి?'

'నా పెళ్లాం!' వాడి ముఖంలో గర్వం, హోదా తాలూకు కళలు మెరుస్తున్నాయి!

'నీకు సరిపోతుంది!'

ఇంతలో వాడి పెద్ద బావమరది గబుక్కున వచ్చి 'ముఖ్యంగా మిమ్మల అభినందిస్తున్నాను. మీలాంటి మిత్రబృందం ఉంటంవల్లనే సంస్కరణాభిలాషలూ, స్వేచ్ఛా ప్రయత్నమూ కలుగుతుంటాయి. ఇల్లాంటి పుణ్యపురుషుని చూసినప్పుడు నా కండ్లు చెమ్మగిల్లుతుంటాయి వీరిని నే నేమని అభినందించేది?'

'చేసిన మెప్పు చాలదూ? కొరవా, పరవా మీ చెల్లెలు చూసుకోగలదు!' అంటూ పైకి నేను అనలేదు.

నందకుమార్ ఉదాత్తమైన అవలోకనాలు మా వేపునుండి లోపల వేపుకు ప్రసరించాయి. నేనూ అటే చూస్తున్నాను కాబట్టి, మెరుపులా తళుక్కున మెరిసి పోయిన వాడి మరదలు కనిపించింది.

'మేము చూడండి ఎంతో కష్టపడాం! ఇవాళ ఒకమోస్తరుగా నుంచోగలిగాము. ఇది సంతోషంగానే ఉంది. మా నాన్న నాకోసం ఏమీ మిగల్చలేక పోయినా, ఇద్దరు పెండ్లాడాల్సిన చెల్లెళ్లను వదిలి పోయాడు. ఎంత కష్టమో ఆలోచించండి? పాటకూ, బట్టకూ జరుపుకోడమే బ్రహ్మాండమవుతూంటే, ఇంకా వేలకువేలు కుమ్మరించడం సామాన్యమా?' అని అతను ఒక నిముషం కూడా విరామం తీసుకోక, 'నందకుమార్ విశాలహృదయుడు కావటంవల్లనే, ఎవళ్ళకెంత అనిష్టమైనా తన ఆశయాన్ని చక్కగా ప్రదర్శించి కృతార్థుడైనాడు!' అని అతడు వెళ్ళిపోయాడు.

అతడి ధోరణీ, తత్త్వమూ నేను అప్పుడు బాగా అర్థం చేసుకోలేకపోయాను.

'మంచి బావమరిది నే సంపాదించావ్!'

'ఆయనకేంలేయ్! గజెటెడ్ రాంకు లేదనే కానీ, సెంట్రల్ లో అంత జీతంవచ్చే ఉద్యోగం!'

'ఆయన తమ్ముడో!'

'రీసెర్చి చేస్తున్నాడు!'

'అదృష్టమే! చాల బావుంది!'

'ఎక్కడ సమ్మంధం చెప్పరా! భగవంతుడు ఎక్కడెక్కడికి గీచి, ముడివేస్తుంటాడో తెలీదు. మన ఊరెక్కడా వీళ్ళెక్కడా?'

'ఔను!'

వాడూ వెళ్ళిపోయాడు. పెండ్లిలు చాల సందడిలో ఉంది, కానీ నేను ఎదురు చూస్తున్న వ్యక్తి మాత్రం అగపడలేదు చాలసేపటినుండి ఎవళ్ళతో మాటాడుతున్నా ఆ వేపుకు చూపులుంచి కూర్చున్నాను.

నందకుమార్ చెల్లెలు ఇటు వస్తోంది. ఆమెను ఆపి, 'మీ నాన్న ఎక్కడా?' అన్నాను.

'మీకు తెలీదా? ఆయన రాలేదు!'

'ఏం?'

ఉదాసీనంగా నవ్వి హేమ వెళ్ళిపోయింది.

ఆయన రాకుండానే వీడు పెండ్లాడేస్తున్నాడా? ఇంత చేసిన ఆయన, కొడుకు ఒక ఇంటివాడు అవుతూంటె రాకపోవడం కారణం?

మావంతో అక్కడనుండి లేచి ఇవతలకు వచ్చాను. స్నేహితులంతా ధూమపాన పారవశ్యంతో, చతుర్ముఖ పారాయణంలో మునిగి తేలుతున్నారు. వాళ్ళముందు లక్ష్మీదేవి కాళ్లగజ్జెల మల్లె డబ్బులు గలగల్లాడుతున్నాయి!

'ఒరేయ్! వాడు తప్పుకపోతున్నాడురా! వాడిని పట్టుకరండిరా!' అంటూ కేక వేశాడు సుబ్రహ్మణ్యం!

'రా! నాయనా! రా! ఓ పేకు పేకి, ఓ చేయి కలిపి, కాసిని డబ్బులు ఇచ్చిపోరా తండ్రీ!' అంటూ హృదయపూర్వకంగా మధుసూదన్ ఆహ్వానించాడు.

చిరునవ్వుతో వాళ్లను వదలించుకుని గబగబా అడుగులు సాగించాను!

ముందువాలో నాగరాజు సిగరెట్ కాలుస్తూ న్నాడు.

'ఏమోయ్! మీ నాన్న రాలేదూ?'

'ఆఁ'

'ఎందుకని?'

'ఈ పెండ్లి ఆయనకు ఇష్టంలేదు. నందూకు మరో సమ్మంధం నిశ్చయం చేసుకున్నాడు. వాళ్ళు నాలుగువేలు ఇస్తామనీ, సొమ్ము పట్టింపు లేదని చెప్పారు. ఆ డబ్బుతో హేమను వదలించుకోవాలని సిద్ధం చేసుకుని కూర్చున్నాడు. కానీ ఈయనగారు ముందే బుక్ చేసుకుని పెళ్ళికి సిద్ధమైనాడు. అంతా అయిపోయాక నాన్నకు తెలిసింది. నలుగురిలో ఇవాళ ఆయన ముఖం ఎత్తుకోలేక పోతున్నాడు. ఎవడికేం? ఎవడిసుఖం వాడిది! అందరినీ పగ చేసుకుని ఏంపొందుతాడో కాలం తేల్చవలసిన రహస్యం!' అంటూ బుసలుకొడుతూ సిగరెట్టును నేలకేసి కొట్టి బూటు కాలితో రాచి పొడిపొడి చేశాడు!

'నీవూ కోపంగా ఉన్నావన్న మాట! మరి నీకూ పెండ్లీడు వచ్చిందనుకుంటాను. నీవు ఆమెను పెండ్లాడి మీ నాన్న వ్రాలిపోయిన తలను పైకెత్తే ప్రయత్నం చేయకూడదూ!'

'ఇప్పుడప్పుడే పెండ్లి చేసుకోదల్చలేదు!'

'సరి! పెండ్లి చేసుకునే తలంపుందా?'

'ఆఁ!'

'మరి ఎప్పుడయితే నేం? వయస్సు నీకూ వచ్చేసింది కూడా! మీ నాన్న కోసమూ, హేమ కోసమూ, మీ అన్న చేయలేని పని నీవెందుకు చేయకూడదోయ్?'

'చదువు పూర్తి కావాలి!' అంటూ నాగరాజు కూసుకుపోయాడు.

కోపంతో వెళుతున్న నాగరాజు వేపు చూస్తూ నందకుమార్ కు అత్తింటి తరఫున ఎంతో బలమైన ఆలంబనము చిక్కకపోతే ఇంతకీ అనిష్టమయిన పెండ్లి చేసుకోడని అనుకున్నాను.

* * *

స్నేహితమంతా ఒకచోట ఉన్నప్పుడే! ఉద్యోగం పేరిట పల నాలుగు దిక్కులా ప్రాకిపోయిన స్నేహితులను గురించి కొంచెం సేపయినా అనుకునేందుకు తీరిక ఈ జీవితంలో చిక్కడంలేదు. వయస్సు పెంచుకుంటూ, ఆయువు తగించుకుంటూ, దిక్కు తెలీక బ్రతకడం వల్ల పొందబోయే లాభం యోచించుకునే ధైర్యమూ, ఓపికా లేక ముందుకుపోతూ పండిపోతున్నాను.

హఠాత్తుగ నందకుమార్ వచ్చాడు. ఎట్టి ఎండలో పిడుగుపడితే ఎంత ఆశ్చర్యపోతామో, అంతే ఆశ్చర్యపోయాను వాడిని చూసి! వాడు మాటలు మాని వేసి చూపుల్లో దీనత్వం చిందిస్తూ కూర్చున్నాడు. అంత కాలానికి కలుసుకున్న మేము మాటా-మంతీ

లేక రాత్రిబొమ్మల్లా కూర్చున్నాము. వాడి ముఖంలోకి చూస్తూ నేను సంభాషణాశక్తి కోల్పోయాను.

వాడిముఖంలో ఆరిపోతున్న దీపకళిక మల్లె మలినకాంతులు వ్యాపించి ఉన్నాయి.

చాలసేపటికి తెప్పరిల్లి, 'ఏమిటి ఇల్లాఅయావు' అన్నాను.

'ఎల్లా అయాననా? బాగానే వుందా రె! ఏం నీకు బాగా జరుగుతోందా? నేను జీవితంలో ఓడిపోయాను. నాకు బంధువులు ఎందుకు లెమ్మను కున్నాను ఇవాళ వాళ్ళకోసం పిచ్చివాడి నవుతున్నాను.'

'అంటే?'

'ఇంక నేను తండ్రిని కాలేకున్నాను! అంటే రెండు జీవితాల గరిష్ఠ సమ్మేళనం నామీద ఉందన్న మాట! అన్నట్లు, నీవింకా పెండిచేసుకోలేదేం?' అని ప్లానంగా నవ్వాడు నందకుమార్!

'చేసుకోవాలేనా?'

'నందకుమార్ గంభీరంగా చూస్తూ అన్నాడు. 'అది కేవలం వ్యక్తిగతమైందికాదు. మునుపు నేను పెండ్లిని వ్యక్తిగతమైందనే తలచాను. కానీ నిజం కాదు. నలుగురతో, ముఖ్యంగా కుటుంబానికంతా సంబంధించిన విషయం అది!'

'అంటే?'

'నీ విషయం చూడరాదూ? వీళ్ళంతా శత్రువులుగా ఎందుకు అయ్యారంటావు? కేవలం పెండ్లిని నా సొంతవిషయంగా అనుకుని ప్రవర్తించినందువల్ల కాదూ? నాగరాజు ఉద్యోగం చేస్తున్నాడా? హేమ అత్తారింటికిపోయిందా? అన్నయ్య పిల్లాపాపలతో హుందాగా ఉన్నాడా, నాన్న ఇష్టంవచ్చిన దగిర నాదగ్గరతిప్ప హాయిగా ఉన్నాడా? ఇంకా ఏళ్ళెందుకు సగ బూడిదం? మొత్తంమీద నేను అన్ని విధాలా నష్టపోయాను!' అంటూ నందకుమార్ రెండు చేతుల్లోకి తల తీసుకున్నాడు.

నాకు ఏమి చెప్పేందుకూ, చేసేందుకూ తోచ లేదు. మౌనంతో, సిగరెట్ల పొగలు చేస్తున్న వలయాలు చూస్తూ కూర్చున్నాను.

ఎంతో సేపటికి బాగా ఆలోచించి, 'అయితే ఇప్పుడు నీకేమయింది నందా?' అంటూ అడిగాను.

'ఏమయిందా? ఇంకా ఏం కావాలి! నాకు పెళ్లి బాగలేదు. కనే రోజులు శారదకు వచ్చాయి. వాళ్ళ అన్న రెండుత్తరాలు రాసినా, 'పెళ్లి జాగ్రత్తగా చూసుకో! బరువు బిందెలు మోయకు! చిత్తడి నేలలో తిరిగేప్పుడు తప్పక చెప్పులు ఉపయోగించు' అంటూ ఉచిత సలహాలు ఓలిపుకు ఇచ్చాడు, కానీ 'వస్తున్నాను తీసుకవెళతాను' అంటూ రాయలేదు! తొలిమాలుకాదా, ఆపాటిజ్ఞానమూ లేకపోయింది! ఆస్పత్రి కాన్పుకు శారద ఇష్టపడలేదు. అందువల్ల తీసుకవచ్చాను. నాగరాజు మమ్ముల్ల చూసి పలుకులేక బజారుకు వెళ్ళిపోయాడు. నాన్న ఇంట్లో లేడు! ఎప్పుడు వస్తాడో తెలీదు.'

'శారదను ఇక్కడకు తీసుకవచ్చావా?'

'ఏమి చేయమంటావ్? అంతకన్నా గత్యంతరం లేకపోయింది. నా ఆరోగ్యం తిన్నగా ఉండటం లేదు. ఎన్నిరోగాలో అన్నీ వచ్చాయిరా తండ్రీ! ఇప్పుడు నాకో దారి చూడు!'

'ఎటు వేపుకు!'

'ఇప్పుడుకూడా హాస్యాలు సాగిస్తావేరా? ఒడ్డునపడ్డ చేపలా గిలగిలాడుతున్నాను.'

'అయితే ఏం కావాలంటావు?'

'నాన్న అగ్నిహోత్రి మవుతాడు, నుగిలం మళ్లే నాగరాజున్నాడు! వాళ్ళిద్దరి కలయికను ఊహించుకుంటే నే భయంగా ఉంది.'

'ఇదంతా నీ ఊహ!'

'ఊహూఁ'

ఆ విధంగా వాడు ఊహించేందుకూ ఆధారం ఉంది. వాడిమీద ముఖ్యంగా ముసలాయన ఆశ పడ్డాడు. వాడి పెండ్లి ఈ చేత్తో చేసి, ఆ చేత్తో హేమనూ ఒకింటిదాన్ని చేయాలని ఆశపడ్డాడు.

చదువుతున్న చదువులో కొంచెం సాయం దొరకుతుందని నాగరాజూ పొంగిపోయాడు.

శారదను ఏమీలేకుండా పెళ్లాడ్డంతో అందరి ఊహలూ గాలికి చెదిరిపోయాయి!

కానీ, నాలుగేళ్ల తరువాత వచ్చిన నందకుమార్ మీద ముసలాయన ఇంకా కోపంగానే ఉంటాడా? ఇవాళ చలిమిడిముద్దలా చప్పగా అణగివచ్చిన వీడిని ఆయన క్షమించకపోతాడా? అందులో ఆత్మీయత

కలు. మిగిలినవన్నీ గేయశీర్షికలు. ఈ గేయశీర్షికలలో ముప్ఫైమూడు, గాంధిగారిని ఉద్దేశించినవి. 'రైతు రాజా' అనేది గేయనాటిక. ఇందులో పొలం దున్నటం మొదలుకొని, ధాన్యరాసులను ఇంటికి తీసికొనిపోవటంవరకూ గల కర్షక జీవితంలోని వివిధ దశలూ వర్ణింపబడినవి. ఇక 'పంచశీల' 'బుద్ధగీత' 'జనవరి 1వ తేది.' 'పతాక వందనం' 'రాజప్రముఖుడు నైజాం' 'గ్రామోద్ధరణం' మొదలైన రాజకీయ వస్తు రచనలూ వున్నాయి. 'వైష్ణవగీత' మనేది 'నరసీ మెహతా' అనే భాగవతుడు పాడినదానికి అనువాదం. ఇది గాంధీగారి పారాయణంలోనిదని కూడా తెలుస్తున్నది. అది యిలా మొదలవుతుంది.

వాడే వైష్ణవుడు, దయగల
వాడే వైష్ణవుడు............
పరులపీడ గుర్తెఱిగిన, నర, సో
దరుడే వైష్ణవుడూ..............అని.

'మనవి' అనే శీర్షికలో స్వవిషయం కొంత తెలుస్తున్నది.

వచ్చినటులు నేను వండి వడ్డించితిని
అదిరా చేదని తిన్నగానంత మందితిని
ఓపినంతగ, రుచిగ, నుంచ కష్టించితిని
లోప మేటికి ? వంట కుదురలేదని యనిన
నా పాక మేమంచి నలపాకమని యనను
ఎవరెవరి రుచులెందు ఎటువంటివో యేమెం
అరని, వండజే దనుప వలెని కశే మేకొను—

అంటూ, తను కవితాపాక నిర్మాణాన్ని గూర్చి కవి, స్వాభిప్రాయం వెల్లడించారు. ఈ సంపుటంలో వున్న శీర్షికల వైవిధ్యాన్ని బట్టి భిన్నరుచులైన జనాన్ని ఆరాధించడంకోసం, కవి చేసిన ప్రయత్నం గోచరిస్తూనే వున్నది.

ఈ శీర్షికలలోనే రుచిభేదాన్ని గూర్చి ప్రస్తావిస్తూ; వీరు—

పుండుపై వ్రాలెడు పురుగటీగ యొకండు
తీపిదినుసుల వ్రాలు తేనెటీగ యొకండు
పాలు నీరును వేఱుపఱచు హంస యొకండు
మోమోటమునకునై మంచు నురిపించువాడు
వెన్న చాటైనంత వెక్కిరించు నొకండు—

అంటూ, లోకస్వభావాన్ని వివరించారు. నిజమైన కవులు ఈ బాదరబందీ పట్టించుకోరు. కనుకనే వీరు—

విలువ నీడల వోలె వెనుకముందుల నడచు
నిందాస్తుతుల కొక్క వందన మొనరింతు —

అన్నారు. ఈ నిర్లిప్తతతోపాటు—

మాలిన్యమును కడిగి బాలు ముద్దుల కిలరు
తెలి యొరాదో మజ్జ తెల్లజానవు మనస్సు

అవమానంలోని వినయమూ—

మతిరిన్న యపుడు నామతిలోని యజ్ఞాన
మరచి గర్వమునోట కంపకుందును నేను—

ఈ వివేకమూ—

నింద విన్నపుడు నాయందున్న గుణజాల
మూహించి దైన్యమ్మునొల్లు గల్పెదను నేను—

అని చెప్పికోగలిగిన ఆత్మప్రత్యయమూ, వుండడం ప్రశంసనీయమైన విషయం! ప్రతిభ కేం! అది దైవ మిచ్చినంతే వుంటుంది. పైని, కవిమాత్రు లెల్లరూ అలవరుచుకోవలసిన సల్లక్షణాలు, మాత్రం అవును.

పిలిచిన ట్లైతె జాముల తోట కెళ్ళితిని
చిలుకపలుకవి తెలిసి పిగొచ్చి మళ్ళితిని
కనుమండె పొదచాటు కన్నెలేడియొ! లేక
వసు గెలిసీయంగ వక్కయుండెనో తానె!

మొదలైన తోట్ల భావస్ఫూర్తి—

అంబ నేసిన చీరలవోలె
తూలుపుగట్టన ఆవులు తోడె—

........................

తూరుపాలబట్టు దుమ్ములో, నిను జూడ
మబ్బులో దండప్పు, మునచేల, దిగిన చెప్పు—
ఈ మొదలైన చోట్ల ఊహారమ్యత, గోచరిస్తున్నాయి. "ప్రతాప ప్రశంస" అనే కవితలో వీరు వెలిబుచ్చిన ఒక అభిప్రాయాన్ని యిక్కడ పరామర్శించడం అవసరం.

కవులు పూజ్యము మీ తెలంగాణసీమ
వసెడి సుప్రథ మా పుటకవతరించి—
ఆ అన్నవారెవరో తెలియనివారై వుంటారు.

ప్రతిభ అనేది దేశకాల నిబంధితం కాదు కదా!

వీరు పోతన గారి జీవితమును వస్తువుగా స్వీకరించి కావ్యమొనరించినట్లూ, తద్వారా ప్రసక్తివల్ల ఆ ప్రాంతంలో " అభినవపోతన " బిరుదాంకితులుగా ప్రసిద్ధులైనట్లూ, ఈ సంపుటి పీఠిక వల్ల తెలుస్తున్నది.

అది బయటికివచ్చి వీరి సమగ్రకృతి అవగాహన చేసికొనగల అవకాశాన్ని ఆంధ్ర రసజ్ఞులకు కల్పించు గాక యని ఆశింప.

## ర క్తా క్షి

శ్రీ సోమసుందర్ : ప్రతులకు : రచయిత. కళా కేళీ పబ్లికేషన్స్ సామర్లకోట. తూర్పుగోదావరిజిల్లా. వెల : తెలియదు.

'రక్తాక్షి' ఖండకావ్య సంపుటిలో మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలోని వన్నీ 'అభ్యుదయ' ధోరణిలో ఖండకావ్యాలు. రెండవ భాగం

కూడా ఇలాగే సాగిపోతుంది. మూడవభాగం పద్య నాటికా, క్రాంతి గోలిసే ఖండకావ్యసముదాయం.

మొదటి భాగంలోని ఖండికలు చాలావరకు 'అభ్యుదయ' రచనలు. రెండవభాగం మూడవ భాగం కొంత నూతనపంథాలో సాగాయి. మూడవ భాగంలో కీర్తి కాముకులుగా అక్కడక్కడ అభ్యుదయ ధోరణి కనిపించినా ప్రాచీనార్ష సంప్రదాయాలు, ఆదర్శాలు, ఎడనెడ ప్రత్యక్షమౌతూంటాయి.

ముఖ్యంగా ఈ భాగంలో రచయిత కొత్తకొత్త ఛందస్సులు వాడి అవి చాకచక్యంతో నిర్వహించారు. దీనికి క్రింది రచన తార్కాణ. ఇది 'విప్లవం' అనే శీర్షికలోని రచన.

'తినయములను కాంచి మన
మనసులు చలించినవి
జనముల విషాదకర
చినిన హృదయమ్ముల్
కదలినవి శోకమున
..................
కనిపించని శౌర్యమున
వణకు భువనమ్ముల్ !"

దీనిమీద అభిప్రాయం వెలిబుచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారన్నట్లు ఈ కావ్యంలోని గూఢార్థం చాలా దురూహంగా ఉన్నది. ఆ నిర్దిష్టములు, అస్పష్టములు అయిన సాంకేతికపదాలు వాడడమే ఈ అస్పష్టతకు కారణం. ఎంతో సహనంతో పరిశీలిస్తే తప్ప ఈ రచన అంతరార్థం బయటపడడం కష్టం.

ఈ కావ్యం రచయితకు గల ప్రాచీనాధునాతన భావాల మీద అభిమానం నిగూఢంగా వ్యక్తం చేస్తున్నది. అయితే ఇది అభ్యుదయదృక్పథం అభిమానించే రచన.

'శాస్త్రి'



## నాటికా గుచ్ఛము

శ్రీ సి. రామకృష్ణారావు. టీచర్, జయహింద్ సెకండరీస్కూల్. మచిలీపట్నం. వెల: ఒక రూపాయి.

దీనిలో 1 అడవి పువ్వులు, 2 ప్రాత క్రొత్తలు 3 స్వేచ్ఛాఫలం, 4 అనుకోని ఆనందం, 5 బాలభటుడు అని 5 నాటికలున్నాయి.

ఈ రోజుల్లో పాఠశాలలో విద్యార్థులు ప్రదర్శించడానికి అనువయిన చిన్న చిన్న నాటికలు చాలా స్వల్పంగా ఉన్నాయి.

అంతగా వ్యయ ప్రయాసలు లేకుండా స్వల్ప వ్యవధిలో విద్యార్థులు సులభంగా ప్రదర్శించుకోడానికి అనువయిన నాటికల గుచ్ఛమిది.

## పురమందిరము

శ్రీ సి. రామకృష్ణరావు, టీచరు. జయహింద్ సెకండరీస్కూల్. మచిలీపట్టణం. వెల: ఒకరూపాయి.

ఇది పాఠశాల విద్యార్థులే కాక తదితరులుకూడా ప్రదర్శించడానికనువయిన సాంఘిక నాటకం. దీనిలో రచయిత సందర్భానుసారంగా పద్యాలే కాక పాటలు కూడా చేర్చారు. గ్రామసేవాభిలాష, కళాభిమానము మున్నగు విషయాలపై అభిమానం పెంపొందించే లక్ష్యంతో ఈ చిన్న నాటక రచన సాగింది.

## నీవు—నేను

శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తి. నంద్యాల. వెల లేదు.

ఇది ప్రాంజలి, ప్రార్థన, ప్రియతమునకు మొదలయిన 15 ఖండకావ్యాల సంపుటి. దీనిలో కథాఖండకావ్యాలుకూడా ఉన్నాయి.

ఈ కావ్యాలలో అంతటా ధారాశుద్ధి, సంస్కృతాంధ్ర పాండితి, సంప్రదాయ విజ్ఞానము అనుస్యూతంగా గోచరిస్తున్నాయి.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.